విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬    102883    జులై ౨౩ వ తేది ౧౯౩౬ గురువారము    అర్ధ సం॥ చందా రూ ౩

సంపుటము ౧౧ | త్రూపుబజారు, హైదరాబాదు - దక్కన్. | సంచిక ౨౨

శా. శ. ౧౮౫౮ శ్రీ ధాత సం॥ శ్రావణశు॥ ౫ గురువారము ౧౬ మహాశేవరు ౧౩౪౫ ఫ.

## పంచదార పరిశ్రమ

పి. వి. రమణారావుగారు
బి. యస్సి. (అనర్సు) టెక్నాలజీ

నిజామురాష్ట్రము ఉత్తరహిందూస్థానమున కన్న భూమధ్యరేఖకు దగ్గరగానుండుటచే చెఱకు పంటకు కావలసిన శీతోష్ణ స్థితులు కలిగి మిక్కిలి అనుకూలముగా నున్నదని చెప్పవచ్చును. శీతభూమియగుటచేత పంటకు మంచుదెబ్బ తగులదు. ఉత్తరమున హిమాలయ ప్రాంతములకు పోనుపోను మంచు అధికమై చెఱకు పంటకొటంకముగానున్నది. అందువలననే అట్టిచోట్ల చెఱకు దృఢముగా పెరుగకపోవుటయేగాక కొన్ని సమయములలో మంచుదెబ్బతగిలి ఏపుగా పెరిగిన పంటయంతయు ఒక్కసారిగా [illegible]పట కూడగలదు ఈ నిజామురాష్ట్రము [illegible]మములకును, పడమటి కనుములకును [illegible]నుండుటచే వర్షాధారముకూడ [illegible]లముగా నుండునని చెప్పవచ్చును ఇన్ని సదుపాయము లో[illegible]డియుండు మన యీ రాష్ట్ర[illegible]శాల్యములో చాలకొద్ది భాగము చెఱకుపంటకై వినియోగపడుచుం[illegible] శోచనీయమైన విషయము.

కాని ఈపంటవిషయమై ప్రభుత్వమువారు శ్రద్ధవహించినట్లు విశదమగుచున్నది. క్రమేణ ఈపంట అభివృద్ధిలోనికి తీసుకొని రాబడుచున్నది దానివిలువ ఇప్పుడిప్పుడు తేటతెల్లమగుచున్నది. దానివైశాల్యము పెరుగుచున్నది. ప్రజలయుత్సాహము ప్రబలుచున్నది. అభిరుచులు క్రొత్తపద్ధతుల నవలంబించుచున్నవి. సదుపాయములు సమకూరుచున్నవి. రైతాంగమురొక్క రంగమభివృద్ధి గాంచనున్నది. పనివారు పంచములుచేసి పనిచేయుదురు. పరిశ్రమాలయములు ప్రారంభింపబడనున్నవి. ప్రజలకు స్వతంత్రజీవనోపాధి చేకూరనున్నవి. బీదరికము నశించనున్నది. ధనవంతులు ధనమునూటకట్టుదురు. గృహలక్ష్మి గృహమునకు కాపలాయుండును.

ఇట్టి ఉన్నతస్థితికి తగుకారణములు లేకపోలేదు. చెఱకుపంట నభివృద్ధిలోనికి తీసుకొనివచ్చు ప్రయత్నములు ఈరాష్ట్రమున చాలకాలమునుండి జరుగుచునేయున్నవి. గత ౪౦-౫౦ సంవత్సరములలో చెఱకువైశాల్యము ఎంతలేదన్నను చాలుగైదురెట్లు హెచ్చినది. ౧౮౮౦ వ సంవత్సరమునకు సుమారు ౧౧౫,౨౦ ఎకరముల భూమి దక్కనులో చెఱకుపంట క్రింద నుండెడిది. ౧౯౨౬-౨౭ సంలో దాదాపు ౪౭,౨౫౬ ఎకరములవరకు పెరిగినది. ౧౯౩౩-౩౪ లో వ్యవసాయశాఖవారి అంచనాల ప్రకారము ౪౬,౪౮౦ ఎకరములవరకు పెరిగినది. ఈదిగువపట్టిక పంటయొక్క ఔన్నత్యము ఎట్లు క్రమముగా ప్రవర్ధిల్లినది తెలియపరచుచున్నది.

### ౧౧ వ అధ్యాయము

### నిజాము రాష్ట్రము నందలి చెరుకుపంట విస్తీర్ణము

| సంవత్సరము | చతురపు మైళ్లు | ఎకరములు |
|---|---|---|
| ౧౮౮౧-౯౦ | ౧౮ | ౧౧౫,౨౧౦ |
| ౧౮౯౧-౧౯౦౦ | ౨౦ | ౧౨,౨౦౦ |
| ౧౯౦౧- | ౨౯ | ౧౮,౫౬౦ |
| ౧౯౦౫ | ౨౮ | ౧౮,౫౬౦ |
| ౧౯౩౨-౩౩ | | ౪౦,౨౧౬ |
| ౧౯౩౩-౩౪ | | ౪౬,౪౮౦ |

ప్రభుత్వము వారొనరించినతీరని ఉపకారమే ఈ చెఱకుపంట కిట్టిఆధిక్యమును కలుగజేసినది. పోచ్చారమువద్దను, నిజాముసాగరమువద్దను నిర్మింపబడినవి. వ్యవసాయవిషయములలో ఖ్యాతిగాంచిన డాక్టరు (Harald H Mann D sc,) గారిని చెఱకుపంట నభివృద్ధిలోనికి కొనివచ్చు విధములగూర్చి యాలోచింపవలసినదిగా నియమించిరి. వారును అప్పటిపరిస్థితుల బాగుగ పరిశీలించి వారియుద్దేశములను తెలియజేసిరి

అప్పటివరకు ఈరాజ్యమున పంచదారతయారగుచుండుటలేదు. మొత్తముమీద ౪౭,౨౫౬ ఎకరముల భూమిమాత్రము చెఱకుక్రింద సాగుబడియగుచుండెడిది దీనిలో ౫౦౦౦ ఎకరముల మీదవచ్చుపంట ప్రజలకు తినుబండారముగా విక్రయింప బడుచున్నది. అప్పటికింకను మామూలురకముల చెఱకే విరివిగా వాడుకలోనున్నది. దానినే [స్థానికజాతి] "లోకలువెరైటీ"లందురు. ఇది క్రొత్తరకపుచెరకుకన్న ఎకరమునకు చాలతక్కువగా పండుచున్నది క్రొత్తరకపుచెఱకు ౨౫-౩౫టన్నులవరకు నిచ్చుచో ఇది ౧౫-౨౧ టన్నులుమాత్రమే ఎకరమునిచ్చుచున్నది. సుమారు ౧౮ టన్నులచొప్పున చూచినచో ౫ వేల ఎకరములు ౯౦౦౦౦ టన్నులత దిగును. మిగిలిన ౪౨,౨౫౬ ఎకరముల పంటయు "గుర్"గా మార్చబడుచున్నది. అనగా ౭౬౦,౬౦౮ టన్నులచెఱకు "గుర్"క్రింద నుపయోగపడుచున్నది. ఈచెఱకునుండి ౧౦౩౫౦౦ టన్నుల "గురు" దిగుచున్నది. ఎకరమునకు దాదాపు ౨.౪౫ టన్నుల "గురు" లెక్కవేయబడినది. ఈలెక్కప్రకారము ౧౦౦ టన్నులచెఱకునుండి ౧౩.౫ టన్నుల "గురు" తీయవచ్చును.

కాని మొత్తముమీద నిజామురాష్ట్రములో ౧౩౦౦౦౦ టన్నుల "గురు" ఖర్చగుచున్నందున, పై ౨౬,౧౦౦ టన్నులు ఇతర ప్రదేశముల నుండి వచ్చుటకు దిగుమతియగుచున్నది ఈదిగుమతిఎకరమునకు ౨.౪౫ టన్నుల ప్రకారము ౧౦౬౦౦ ఎకరములకు సమానము. కాన చెఱకుపంటపై అభిరుచికలిగెనేని, మరి ౧౦౬౦౦ ఎకరముల భూమికూడ చెఱకుక్రింద సాగుబడిలోనికి తీసుకొనిరావచ్చును. ఎకరమునకు దిగుపంట యట్లేయుండెనేని ఇన్ని ఎకరములకూడ చెఱకున నుపయోగించినమేని అప్పటికి నిజాము రాష్ట్రమునందలి ప్రజలకు వలయు "గురు"ను తయారుచేయగలుగుదుము. అంతకన్న ఎక్కువ సాగుబడిచేసినచో మిగిలిపోవు "గురు"ను పై ప్రదేశములకెగుమతిచేయవలసివచ్చును. లేక యీ రాష్ట్రమునందే అదంతయు కర్చుకావలెనను చో ప్రతమును జాడు ఇదివరకు కన్న ఎక్కువగా వాడవలయును లేక పరిశ్రమాలయములలో చక్కెరను తయారుచేయవలసి వచ్చును.

అందుచేతనే డాక్టరు మాన్ గారీ దిగువ తీర్మానము ప్రమేరించిరి.

౧ ఇప్పటి పరిస్థితులప్రకారము చెఱకుక్రింద సాగుబడియగు భూమిని మరి ౧౦--౧౧ వేల ఎకరములవరకు ఎక్కువ చేయుటకు ఏ ఆటంకమును లేదు దిగుమతియగు "గురు"పై నాటికి ౫ వంతున విధించబడిన దిగుమతిసుంకము స్వదేశపంటను కాపాడుచున్నది. ఈ వైశాల్యాభివృద్ధికి వలయు నీటి సదుపాయము కావలసి యున్నది.

౨. ౧౦౬౦౦ ఎకరములకన్న చెఱకు వైశాల్యమును వృద్ధిచేసినచో రాష్ట్రమునకు కావలయు "గురు"కన్న ఎక్కువగా తయారగుటచే దానిని యితరప్రదేశములకు పంపవలయును అందులకు ఇతర ప్రదేశములలో తయారగు "గురు"తో అది పోటీసలుపవలయును.

౩. నిజాముసాగరు పరిసరభూములలో నొకపరిశ్రమాలయము నిర్మించవచ్చును. పరిశ్రమాలయములకీ స్థలము మాత్రమే చాల అనుకూలముగానున్నది.

౪. ఆహ్లాదమును, ఉత్సాహమును రైతాంగమునకీకార్యమున కలుగజేయవలెనని. నీటి సదుపాయములను వృద్ధిపరచుటయు, నీటిపన్ను తగ్గించుటయు, ఎక్కువదిగుబడి తక్కువఖర్చులో చేకూర్చు క్రొత్త కోయంబత్తూరు చెఱకురకపు అంట్లవ్రయుక్కలను రైతులకు ఉచితముగా నిచ్చుటయు, వాటని తగురీతినిపెంచు బాధ్యతను తగుఉపదేశముల వారికందజేయుటయు, మున్నగు పనులను శ్రద్ధతో చేయవలసియున్నది.

ఈమున్నే శ్రీవత్స గారి సలహానుగూడ దక్కను ప్రభుత్వమువారుకోరిరి. శ్రీవత్సగారిచే ఆను, [illegible] బ్రిటిషుప్రభుత్వము వారి [illegible] సలహా నొసంగు దురంధరులు. నిజాముసాగరు అవకాశమువలన చేకూరుచున్న అతిచౌకైన నీటిసదుపాయమును సక్రమముగ నుపయోగించుటకుగాను, ఆప్రదేశమున యొకపరిశ్రమాలయము నిర్మించుటయేగాక, చాలవరకు భూమిని చెఱకునకై సాగుబడి చేయవలసియున్నదని సలహానిచ్చిరి దాదాపు ౨౦౦౦౦ ఎకరములవరకు చెఱకుకై వినియోగింపవలయునని. ఇన్ని ఎకరములు సాగుబడిలోనికి తెచ్చినచో డాక్టరుమాన్ గారి యుద్దేశములకు వ్యతిరేకము గాదాయని తోపవచ్చును, కాని నిజాము రాష్ట్రమును ఉత్తరహిందూస్థానము మొదలగు ప్రదేశములతో పోల్చిచూచినచో విశదముకాగలదు.

హిందూదేశము నకంతయు సగటుమీద మనిషిఒక్కంటికి దాదాపు ౬-౭ పౌనుల చక్కెరయు ౨౦-౨౫ పౌనుల బెల్లమునుప్రతిదానికి కర్చగుచున్నది. ఐరోపాసంగ్రామ కాలమునుండి మనదేశమునగూడ నాగరకత అతిక్రమముగా పెంపొందనది దానిచే అభిరుచులు కూడనవీనపద్ధతులనవలంబించుచున్నవి. "గురు"వాడుక క్షీణించకపోయినను చక్కెరవాడుకయధికమగుచున్నది. ఈవిషయము దిగువ నుదహరింపబడినపట్టిక మూలమున యూహింపందగును.

| | |
|---|---|
| ౧౯౨౩-౨౪ సం॥ | పౌనులు |
| చక్కెర మ ౧కి | ౪-౭ |
| గురు మ ౧కి | ౧౬-౫ |
| మొత్తము | ౨౧-౨ |
| ౨౪-౨౫ సం॥ | పౌనులు |
| చక్కెర మ ౧కి | ౫-౮ |
| గురు మ ౧కి | ౧౧-౫ |
| మొత్తము | ౧౭-౨ |
| ౨౫-౨౬ సం॥ | పౌనులు |
| చక్కెర మ ౧కి | ౮-౬ |
| గురు మ ౧కి | ౧౪-౦ |
| మొత్తము | ౨౨-౬ |
| ౨౬-౨౭ సం॥ | పౌనులు |
| చక్కెర మ ౧కి | ౬-౭ |
| గురు మ ౧కి | ౧౫-౪ |
| మొత్తము | ౨౨-౧ |
| ౨౭-౨౮ సం॥ | పౌనులు |

౧౫ వ పేజి చూడుడు

## విచిత్రవార్త నిజమని తేలుట

హైద్రాబాదు జీవరక్షా జ్ఞానప్రచారకమండలి ప్రచారకులు శ్రీ॥ శ్రీ॥ మూర్తిగారు మా క్రిందిలేఖను ప్రకటనార్థమై పంపినారు:—

ది ౧౮-౭-౧౯౩౬ గల "బొంబాయి సమాచార్" అను గుజరాతీ దైనికపత్రికలో మధ్య రాష్ట్రములో సాగర్ పట్నములో వరియావలీనాకావీధియందు నివశించు కంచెడీ చాకలిముదుసలికి అమ్మవారుపూని పశుబలి చేయువారిని నాశనము చేయుదుననియు, అప్పుడు ప్రసాదముకొరకై చేయిచాపియుండిన యొకప్రేక్షకుని చెంపదెబ్బకొట్టినట్లును ప్రకటింపబడెను. హైద్రాబాదు (దక్షిణ) జీవరక్షా జ్ఞాన ప్రచారకమండలివారు సాగర్ జిల్లాలో ప్రచారముచేయుచున్న "పశుబలి నిరోధసమితి,సుఖ్రాంతియశాఖా, సాగర్" యొక్క కార్యదర్శిగారికి పై సమాచారముయొక్క సత్యాసత్యములు కనుగొని వ్రాయుమని కోరుచూ పత్రము వ్రాసియుండిరి. అపత్రమునకు ఈ క్రిందితెలుపు నిజవార్తవచ్చినది. దాని సారాంశము ఇది.

"అయ్యా, తమఉత్తరమందినది. పైవార్త పూర్తిగానిజము మా సమితిసభ్యులు —అమ్మవారి పూజాసమయమునను సాగర్ పట్నమున "వరియావలీనాకా" వీధిలో కైధియావారీ దేవిపూజలుగనుండ అక్కడ ప్రచారమునకై పోయియుండిరి. దానిలో ౭౦ సం॥ల చాకలిముదుసలి ఆవేశముతో ఇట్లు ఏడ్చుచూ చెప్పసాగెను. "జనులునన్ను అగౌరవపరచుచున్నారు. అందరునూ నాకుబిడ్డలే. నేను బిడ్డలను చంపితినునటువంటి దయ్యము, భూతపిశాచముమాత్రముగాను" అనిపశుబలిచేయు పాపాత్ములపాపమునకై ఏడ్చుచూ మరలయిట్లు చెప్పసాగెను.

"బిడ్డలారా! నేను మూడుఘంటలకాలము ఇక్కడయుండెదను. దేవిపూజారుల కేమైన సందేహములున్నచో ఆట్టివారు నాతో శాస్త్రార్థము చేయవచ్చును ఇకనేను పశుహత్యసహించజాలను. నాపేరుమీద జీవజంతువులను బాధించువారి కుటుంబములు నాశనము చేసెదను. మరియు భూమిని తలక్రిందులచేయుదును. జాగ్రత్త" ఈసమయమున దేవీ ప్రసాదమునకై అక్కడున్న సమితిసభ్యులతోకూడి "గుబరాకాఫీ" యనువ్యక్తి ప్రసాదముకొఱకు చేయిచాపెను. అప్పుడు శక్తి—ఆవేశముతోనుండిన చాకలి "గుబరాకాఫీ" చేయి గట్టిగాపట్టుకొని చెంప పగలగొట్టె "ఓరీ! నీవునాపేరుమీద మేకను బలియివ్వనున్నావు నేనెరుగుదును. మేకను హింసించినట్లయిన నీయిల్లు నాశనము చేసెదను" అంతట ఆవ్యక్తి బలియివ్వ నుద్దేశముండినట్లు ఒప్పుకొని యికమీద జీవహింస—బలి—చేయనని ప్రమాణము చేసెను ఈఘటన పూర్తిగా సత్యము. అనేకమంది ప్రత్యక్షముగా వినికనియున్నారు."

"సాగర్ పట్నమున సదరు బజారులో చమర్వాడ(?)స్త్రీలో పశుబలి వాపుటకై మా సమితిసభ్యులు వెళ్లియుండిరి. పశుబలి చేయువారితో ఆమేకలను మాసమితికి ధర్మము చేయుమని కోరెను కాని ఒకరు బలవంతముగా మేకనుకోయబోగా ప్రచారకుడు తన తలయొగ్గెను. ఇందుపై జనులు ప్రచారకులనుగొట్టిరి. ఇది నగరములోనున్న గౌరవనీయులగు కొంతమంది విచ్చేసి వారికినచ్చజెప్పిరి తత్ఫలితముగా పశువుల నాయకుడు ప్రమాణము చేసి యిక మీదటనుండి జీవహింసచేయనని చెప్పెను. అయ్యా నేనిప్పుడు తెలుపుచున్నవార్తలు విశ్వసనీయమైనవి. తమరు విశ్వసింతురుగాక!"

ఇట్లు తమ విధేయుడు
నారాయణ ప్రసాద్ రాయజాదా

---

### దక్కన్ మానవసేవాసమితి
(సికిందాబాదు)

### అహింసా ప్రచారము

ఇతః పూర్వమువలె సమితిపక్షమున యహింసాప్రచారము ౨౧వ జూన్ ఆదివారమునాడు ప్రారంభింపబడినది. ప్రజలలో ప్రబోధము తీవ్రమయి నానాటికి పవిత్ర దేవ్యాలయముల నంబీపశుబలి తగ్గుచున్నది గతవత్సరము ప్రచారము. మారువాడీసోదరుల సాయముచే నూతనాకారమువహించెను. జనులబలిమూలి బలులకై తెచ్చినపశువుల జంపనివ్వక త్రిప్పి పంపియో లేక వాటికయినమూల్య మొసంగి గోశాలకు బంపుటయోజరిగెను. అనియెల్లబరికించిన పౌరమహాశయులు యీ సంవత్సరముకూడ మారువాడీసోదరుల సాయముతో బయలుదేరిన సమితియొక్క యమూల్యోపదేశంబులకు జెవియొగ్గి చాలవరకు యీదుష్కార్యము మానిరి. మహాకాళిఆలయముకడనే యిట్టిఘోరపశువిశసనము గతవత్సరములకు బోల్చిచూచిన శత,ంహ సాంశమైనను లేదని చూచినమహాజనులే ఒప్పుచున్నారు

ఈవత్సరము ప్రచారము సికింద్రాబాదులోని మూలమూలలకు,బాకి నల్లగుట్ట, బోయిగూడ, రెజిమెంటల్ బజారు మొదలగునగరాంతసలములనుండి సర్వప్రదేశములందునుసాగియున్నది

సమితియొక్క యీప్రచారము కేవలయహింసా విషయకోద్బోధనముచే విరమించక కడుంగడు హేయమౌ మద్యపాన పిశాచనిర్మూలనమునకుగూడ తనశక్తికొలది యొనర్చియున్నది ఈమద్యపాననిషేధమునకై విశేషముగ పాటుబడియు, పాటుబడుచున్న శ్రీయుత శ్యామారావుగారెంతయు వంద్యులు. ప్రచారముప్రారంభించిననాటినుండియు, వయోవృద్ధులయ్యు యీకాలపు వయసువాండ్రకన్న విశేషదీక్షతో ప్రజలను హింసాకార్యవిముఖులగునట్లు ఉపన్యాసములుగావించిన శ్రీయుత పండిత సోమనాథరావుగారికి సమితిపక్షమున యెంతయు కృతజ్ఞతను. సమితియీప్రచారము నొక్క సికింద్రాబాదుతోనే విరమించుకొనక మద్ఫోర్టు, సిక్కుతోట, బోయిన్ పల్లి,ట్రిమల్ గిరి బొల్లారములలోగూడ యథాశక్తి జరిపియున్నది. మాయొనర్పుకార్యమునందు సానుభూతి గలిగి మేము కోరినవెంటనే తమ భజనమండలిని బంపిన శ్రీజీవరక్షాప్రచారకమండలియొక్క కార్యదర్శికిని మాతో బాల్గొనిన తన్మండలిసభ్యులకును, బొల్లారం జీవరక్షాప్రచారకమండలికిని తత్కార్యదర్శులకును మాసమితిపక్షమున ధన్యవాదశతంబులర్పించుచున్నాడను. మాతో బాటు కష్టపడి యుపన్యాసములొసంగిసాయపడిన శ్రీయుతులు యస్. రామస్వామి, పోలంపీరయ్య యాదవ, పోలం వీరమల్లయ్య యాదవ మాధవరావు, రాజరత్నం మొదల్యారు గార్లకు సమితిపక్షమున మిగుల కృతజ్ఞుడను.

అర్థికావసరంబుల సాయపడి యహింసాప్రచారార్థము సమితిపక్షమున జయప్రదముగా నిర్వహింపబడ తోడ్పడిన శ్రీయుతులుఆగ్రవాల్ సుమేరుల్ మల్ మొదలగు మారువాడీసోదరులకు ధన్యవాదముల నొనర్చుచున్నాడను.

కుమ్మరిగూడెంలోనున్న ముత్యాలమ్మగుడికి వెనుకవైపుననున్న యంత్యజుల (హరిజనుల)దేవ్యాలయమునందు సమితిప్రబోధముచే వారెల్లరు సాత్వికపూజలొనర్చిరి. సవర్ణులు వీరిని జూచియైన నేర్చుకొనకుండుటజూడ ఇప్పుడెవ్వరస్పృశ్యులు?

పలువురు, సమితియొనర్పు మానవసేవయందభిమానముంచి, సభ్యులుగజేరుదురుగాకయని గోరుచువిరమించుచున్నాడను.

దక్కన్ మానవసేవాసమితి కార్యాలయము, సికింద్రాబాదు. ౧౪-౭-౩౬ } అ.వే. దత్తాత్రేయశర్మ గౌ. కార్యదర్శి.

---

## రాకీపున్నమ

### సర్కారువారి జంత్రీలో పొరపాటు

మ. రా. రా. శ్రీ. గోలకొండ పత్రికా సంపాదకులకు:—

అయ్యా,

రాకీలపూర్ణిమ ప్రతిసంవత్సరము పూర్ణిమరోజే అగునుకదా! పూర్ణిమ సోమవారము ౩వ షహరేవరు ౧౩౪౫ ఫ నాడు అగును. సర్కారు జంత్రీలో ౨౪ షహరేవరు ౧౩౪౫ ఫ.రోజున సర్కారు ఉద్యోగులకు సెలవులనియున్నది జంత్రీలో తప్పుఉన్నదని నాభావన! కావున ౩వ షహరేవరు ౧౩౪౫ ఫ, నాటికి సర్కారువారి సెలవు మార్పుగలందులకు తమపత్రికమూలమున కోరుచున్నాను,

ఇట్లు
యస్. ఆర్. శేషపాండ్య.

---

ఛగన్ లాల్ నారాయణ్ జీ

అత్తరు వ్యాపారులు

మచ్లీకమాన్, హైద్రాబాదు

మావద్ద అన్నివిధములైన స్వదేశీ అత్తరు తైలములు, అగరుబత్తీలు, కుంకుమపూవు,చాయదబ్బీలు జర్దా మొదలగునవి అమ్మబడును.

---

వరప్రసాదము

శస్త్రకాసవము:— దేహములోరక్తముజనించి శక్తిహీనులకు బలముకలిగించు దివ్యౌషధము మావద్దనే లభించును ప్రతివ్యాధికిచికిత్సచేయుసమయము ఉ. నుంచి11 వరకు 4 నుంచి 8 వరకు.

కవిరాజవైద్యశాల
ధూలిపేటరోడ్డు, హైద్రాబాదదక్కన్

---




---



నల్లత్రాచు

కాటువేసి విషము క్రక్కెనా యింక నా విషానికి విరుగుడు లేదు.

నల్ల త్రాచువంటిదే-మానవునకు నిరుత్సాహము కలిగించు నీరసము. త్రాచు విషమునకు తిరుగులేకున్న లేకపోవచ్చు గాని మానవుని నీరసమునకు—నిస్సత్తువకు అదృష్టవశాత్తు విరుగుడు వున్నది. అది అమృత సేవనము.

మానవుని ఆవరించు నిస్సత్తువను పారద్రోలి,
ఉష్ణరక్తమును జీవితోత్సాహము నిచ్చునది
"అమృత"

కేసరీ కుటీరం, మదాసు. ఏజంట్లు: శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ.

---

వీర్యస్తంభనరసాయనము
5 గంటలు స్థిరము అగును.

నీరైన వీర్యమును ఘట్టిపరుచును. మూత్రములో పోవుట ఆపును. ఆతిశీఘ్రస్ఖలనము ఆపి లింగపటుత్వము ఘంటలకొలది యింద్రియపటుత్వము గల్గించి సంభోగమందు స్త్రీపురుషుల కెనుపుకు హాయినిచ్చును. ముసలివారికి వీర్యప్రదాత, నపుంసకులకు చింతామణియే సంతానహీనులు సంతానవంతులేయగుదురు చూస్తే ౧-౨ ఘటలలోనే మజా తెలుస్తుంది. మజాలేకుంటే సొమ్ము వాపసు ౪౦ దినములమందు ఖరీదు ౧-౮ లు వి. పి. ఖరు ౦-౬-౦ లు. శాంపిలుగాని అర్ధ డబ్బీలుగాని దొరకవు. జాబులు తెలుగులోనే.

అడ్రసు,—
డాక్టర్ రత్నం బ్రదర్సు, కుష్టురోగ వైద్యశాల
౨౧౧.౨. బి. మలకపేట హైద్రాబాదు,

# ఆలంపూరు తాలూకాలో ప్రైమరీ పాఠశాలలకై రూ ౫౪౦౦ లు

[స్వ వి.]

౧౨-౭-౧౯౩౬

వర్షములు లేవు

ఇంతవరకు ఈతాలూకాలో వర్షములులేవు. ౫-౬ గ్రామములలో కొంతపదును అయినందున ౨౦-౨౫ దినాలనాడు విత్తనము వేసియుండిరి. కాని ఇంతలో వర్షములేకుండిన ఏమౌనో పరిణామము.

పాఠశాలలు

ప్రభుత్వమువారు ఈతాలూకాలో జల్లాపురము, ఉండవెల్లి, క్యాతూరుఅను గ్రామములలో ప్రైమరీ పాఠశాలలు కట్టించుచున్నారు. ఒక్కొకపాఠశాలకు ౧౮౦౦ రూపాయీలు మంజూరీ యిచ్చియున్నారు. పాఠశాలలనిర్మాణము ఇంచుమించు ముగియవచ్చినది

గద్వాల అబ్కారీ

గద్వాలసంస్థానము అబ్కారీ మామిలాను మద్రాసుసిస్టముపైన ఖాల్సావారు హర్రాజుచేయుటకై ఏర్పాటుచేసినారు. ౧౫ షహరేవర్ నాడు అబ్కారీ తాలూకాదారుగారగు వీ. ౧౦ గారెడ్డిగారు ఆలంపూరులో ఏలం పాడుదురని తెలియుచున్నది

తహసీల్దారుగారు

యువకులును, ఆంధ్రులును, గ్రాజుయేట్లును అగు తహసీల్దారుగారు చాల యుత్సాహముతో, న్యాయముతో తమ కచ్చేరీపనులను నిర్వహించుచున్నారు. గతవారము క్యాతూరు, సేరిపల్లె, ఉండవెల్లి తక్కాశీల మున్నగు గ్రామాల దౌరాచేసినారు. తాలుకుదారుగారు యీవారములో తాలూకాకు రానున్నారని తెలియుచున్నది.

## సంగారెడ్డికి సూబేదారు రాక

మెదకు మండలాధిగారియగు ఈశ్వరనతాచీ నాయిగారి సెలవుకాలము తీరిపోవుటచేత ౨౧ అమర్దాదు సన్ ౧౩౪౫ ఫ. మౌల్వీఖుద్దూసుహుసేన్ తాత్కాలిక మండలాధికారినుండి పదవిని స్వీకరించిరి.

మెదకు సూబేదారుఅగు మౌల్వీమీర్ అహమదలీఖాన్ గారు పరిశీలన నిమిత్తమై దయచేసి పరిశీలనల చేయుచున్నారు, యింకా ౪-౫దినములు వుండగలరని తెలియుచున్నది.



# గ్రామ సమాచారములు

## కొత్తూరు పాఠశాల స్థాపనము

(ఒకవిలేఖరి)

కొత్తూరు ౧౫-౭-౧౯౩౬.

౭వ జూలై ౧౯౩౬ తేదీని శ్రీయుతయం ఆర్. చారిగారు, శ్రీయుత అనంతప్రసాద్ గారును శంషాబాదునుండి ఉదయం ౯గంటలకు సైకిళ్లపైవచ్చియుండిరి శ్రీయుతచారిగారు గ్రామపెద్దలను, పాఠశాలచందాదారులను ఇతర గ్రామస్థులను సమావేశపరచి పాఠశాల స్థాపనోద్దేశ్యములను కొన్ని ముఖ్యనియమములనువిపులముగా వెలిబుచ్చియుండిరి చందాలమీద స్థాపింపబడు పాఠశాలఫలితముల బోధించుచూ వీనికిని ఖాన్గీపాఠశాలలకుగల భేదములను తెలిపిరి. ఉదయము ౧౦౻గంటలకు పాఠశాలనుస్థాపించి శ్రీయుత తీర్థప్రసాదుగారిని ఉపాధ్యాయునిగా నియమించిరి.

సమావేశములో ఈక్రిందితీర్మానములను ఏకగ్రీవముగా నందరును నంగీకరించిరి.

౧ గ్రామస్థులైన ప్రతివాని బాలబాలికలకు ఉచితప్రవేశమొసగుట ౨. పరగ్రామస్థులైన బాలికలు మిక్కిలిబీదవారైన దప్ప ఉచితప్రవేశమీయకుండుట. ౩. ఆదివారముతప్ప తక్కినదినములందుదయము ౯గంటలనుండి౧౧ గంటలవరకు. మధ్యాహ్నము ౨గంటలనుండి౫ గంటలవరకును. రాత్రులయందు ౭-౩౦నుండి ౯గంటలవరకు విద్యగఱపుట, ౪. గ్రామస్థుల యిండ్లయందు శుభకార్యములజరిగినప్పుడువిరామము లొసంగుచుండుట, ౫.ఉపాధ్యాయుని వేతనముకంటె నధికముగావచ్చునైని పైకమును మూలధనముక్రింద చేర్చుట.

ఈ ప్రకారముపనిజరిపించుటకు దీనికి శ్రీయుత కణెంపల్లిరామన్న గారిని అధ్యక్షునిగను, శ్రీయుతపాపాలాల్ గారిని కార్యదర్శిగాను శ్రీయుత మల్లిపెద్ది ఈశ్వరయ్యగుప్తగారిని కోశాధ్యక్షునిగాను ఎన్నుకొనిరి.

శ్రీయుత చారిగారును అనంతప్రసాదుగారును ౧౧గంటలకు సైకిళ్లమీద మరల శంషాబాదు వెళ్లిపోయిరి.

## శ్రీబాలభారతి పాఠశాల స్థాపనము

ప్రారంభదినమున ౧౫విద్యార్థులుచేరుట

[ఒక విలేఖరి]

నూరవరం [జాగీర్] ౧౯-౭-౧౯౩౬.

నేడు శ్రీబాలభారతీ ఆంధ్రభాషానిలయము (శంషాబాదు శాఖ) నూరవరం జాగీరువారిచే స్థాపింపబడినది. శంషాబాదు శ్రీయుత యం. ఆర్. చారిగారు స్థాపనోద్దేశ్యములను, నియమములను అందరికి తెలియునటుల చక్కగా బోధించియుండిరి. శ్రీయుత బి లక్ష్మీనరసింహశర్మగారు ఉపాధ్యాయులుగా నియమింపబడిరి.

ఈపాఠశాల గ్రంథాలయాధికారుల యాజమాన్యముక్రింద నుండును గ్రంథాలయకార్యదర్శియే దరఖాస్తుదారులకు ప్రవేశమిచ్చును. ఇందు గ్రామస్థులందరి బాలబాలికలకు నుచిత ప్రవేశమీయబడును. పరగ్రామస్థులు బీదవారైనయెడల సెలజీతములమీదగాని, వారిబాలబాలికలకు ప్రవేశమీయబడదు. ఈపాఠశాల ఉదయము ౭గంటలనుండి ౧౧గంటలవఱకును, మధ్యాహ్నము ౧ గంటనుండి ౪ గంటలవరకును రాత్రి ౭గంటలనుండి ౯ గంటలవరకు తెఱచియుండును. స్థాపకదినముననే దాదాపు ౧౫గురుబాలురును ౨బాలికలును చేరిరి.

గ్రంథాలయకార్యదర్శి బ్ర॥శ్రీ॥ జోస్యుల అనంతాచార్యులుగారు వారియింటిముందరనున్న దివాణఖానా పాఠశాలపెట్టుకొనుటకు ప్రస్తుతము ఇచ్చియున్నారు. స్థలముచాలదనివేఱొకచో పెట్టుకొన గ్రామస్థులభిప్రాయ పడుచున్నారని తెలియుచున్నది

జాబులు

## శ్రీ జగద్గురు పీఠాధిపతుల సమాధాన వైఖరి

శ్రీజగద్గురు శంకరాచార్య దక్షిణామ్నాయ శృంగేరి శివగంగస్వాములవారికి ఒకహిందువు ౨ జూలై ౧౯౩౬ నాడు వ్రాసి, గోలకొండ పత్రికలో ప్రమరింపించినవిజ్ఞప్తియున్నూ, దానికి శ్రీగురువులవారు ౧౫ జూలైనాడు సదరు హిందువునుసంబోధించుచు పంపినసమాధాన శ్రీముఖమున్నూ, అరోజుననే ప్రచురించబడిన విజాంరాష్ట్ర ఆదిజనులవిజ్ఞప్తియున్నూ, ఆవిజ్ఞప్తినందించిన వాలంటీరుకు చూపిన మర్యాదచూచిన ప్రతిహిందువునకు సంశయవిచారములు కలుగకమానవు. శ్రీగురువులవారు ఆదిజనులచే అందజేయబడిన వినతిపత్రమునకు ముందుగనే యీహిందువునకు సమాధానమును పంపినచో శ్రీగురువులవారికి ఆదిజనులు వినతినిపంపుకొనుటయు అవమానముకలుగకుండుటయున్నూ జరిగియుండునేమో. అయిననుదీనివలన శ్రీగురువులవారి యుద్దేశ్యము సర్వజనులకు వెల్లడియైనది శ్రీగురువులవారు వారిముత్తాత, తాత,తండ్రుల నాటినుంచి జరుగుచూవచ్చుచున్న గుడ్డినమ్మకమునే ప్రజలకుబోధించి ఆ గుడ్డినమ్మకమునే ప్రజలాచరించునట్లు ప్రచారము చేయుచుంటిమని సెలవిచ్చినారు. రెండవది దేశములోనుండు సర్వజనులకు యింతకంటెమంచిని కలుగజేయుమని దేవుని ప్రార్థించెదరట. పైపెచ్చు యీహిందువుడు కోరిననాటికిసమాధానము నిచ్చువారు వేరేయున్నారట! వీరిచ్చే సమాధానమింతేనట! జగద్గురువులు సమాధానమిచ్చునది యిదియా! ఈపత్రిక నలుమూలలు వ్యాపించియున్నదగుట, పదుగురీసమాధానమును జూచిన దిగ్భ్రమజెందకపోరని శ్రీగురువుల వారికితెలియదా! వారినమసరించి యున్నవారి శిష్యబృందముగూడ ఆలోచించలేకపోయిరా?. గుడ్డినమ్మకమును బోధించుట కీగురుకొయుశాయని పదుగురనుకొనరా! ? పుట కీగురువులా' మంచిదారిజూపులా! ఒకే! గురువుగారూ వినుండియే వెలువడినదండీ. , ఇంతకు కొనలసినదేముంటుంది. నిజమే

రెండవ హిందువు

## రామలక్ష్మణ విగ్రహములుగల బంగారు నాణెములు దొరుకుట

(స్వ. వి.)

ధనువాడ; ౯-౧౦-౧౩౪౫

మహబూబునగరము జిల్లా, మక్తల్ తాలూకాలో చేరిన ధనువాడ అను గ్రామమున చ ఉ మహారేవరు ౧౩౪౫ ఫ లో శ్రీ భీమసేనరావు ప టువారిగారి కొల్వ త్రవ్వుచుండుగా కూలివాని కి ౪౩ బంగారు నాణెములు దొరికెను. పరిశీలించగా ఆనాణెములపై రామలక్ష్మణుల విగ్రహములు చెక్కబడియున్నట్లు కనబడెను. ఈ సమాచారము పోలీసుపటేలురిపోర్టుద్వారా తెల్పగా పోలీసుఅమీనుగారును, తహశీలుదారుగారును దయచేసి పంచనామాచేసుకొని నాణెములను తహశీలుఖజానాకు తీసుకవెళ్ళినటుల తెలియుచున్నది.

---

### శ్రీజగద్గురు శంకరాచార్య విరూపాక్ష స్వామి

శ్రీజగద్గురు శంకరాచార్య హంపీ విరూపాక్ష స్వాములవారు మాన్వితాలూకా గ్రామములో అడ్డపాలకీవుత్సవముతో నాటాయిబ్బంద్రునగరం శైశ్యులయొక్క ప్రార్థనచే నగరేశ్వరునిగుడిలో ప్రవేశించిరి. తర్వాత యీ గ్రామనవ ౧౩ల రోజున శ్రీశంకర భారతీస్వాములవారి పర్ణంతియున్న బగళలనుంచి బగల వరకు శ్రీగురువులవారియొక్క ఆరాధనయున్ను జరుగగలదు. ముఖ్యశిష్యులువచ్చి దర్శన తీర్థప్రసాదములను గ్రహించదురు గాక.

సెక్రెటరీ

యస్. వెంకటనర్సయ్య.

---



# స్థానిక వార్తలు

### తాడుబందు వీరాంజనేయ స్వామివారి మహోత్సవము

[విలేఖరి]

సికింద్రాబాదు సమీపమునందుగల తాడుబందు గ్రామమువద్ద వేంచేసియున్న శ్రీవీరాంజనేయస్వామివారి సాంవత్సరికోత్సవము అతి వైభవముగా జరిగినది ఈమహోత్సవము ప్రతి సంవత్సరము అమావాస్య శనివారమువచ్చినప్పుడు మాత్రమే జరుగును. ఈసంవత్సరము ఆషాఢ ౩౦ శనివారమునాడు జరిగినది సుమారు ఇరువదిమూడు భజనమండలీలు సికింద్రాబాదు, హైదరాబాదు భువనగిరినుండివచ్చి భజనలు సలిపిరి. వేలకొలదిజనులువచ్చిరి.

---

### డాక్టరు ఆచార్య స్పెషలిస్టు

[విలేఖరి]

డాక్టర్ ఆచార్యగారు ఖమ్మంమెట్టునుండి సికింద్రాబాదుకు వచ్చియున్నారు. వీరున్యూమోనియావ్యాధులకు ప్రత్యేక వైద్యులు, న్యూమోనియావ్యాధిని, గంటలలో తక్కువచేయగల సమర్థులు అనేకులచే మన్ననలందియున్నారు. మొదలు డబ్బుగైకొనక,తగ్గినచో డబ్బుతీసుకొనుచున్నారు. బీదలకుచితముగా మందులిచ్చుచున్నారు.

---

### మున్సఫీ భవననిర్మాణములు

ఉద్గీరుతాలూకా ప్రధాన న్యాయస్థానము (మున్సఫీ) నిర్మించుటకు రు ౪౩౯౩౦ లు హాలీలును. బోధన తాలూకా ప్రధాన న్యాయస్థానము (మున్సఫీ)నిర్మించుటకు రు ౩౯౬౫౫ లు హాలీలును మంజూరుచేసినటుల తెలియుచున్నది.

---

### ఇంజనీరింగు చదువుటకు ప్రభుత్వమువారు అప్పు ఇచ్చుట

ప్రధానమంత్రియగు మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దురుగారు శ్రీయుత డి ని వే ద్ గారికి వారి ఇంజనీరింగు విద్యకొరకై రు ౫౮౦౦ లు హాలీలు ప్రభుత్వముకారి ద్రవ్యమునుండి అప్పుయిచ్చుటకు అనుమతించినట్లు తెలియుచున్నది.

---

### ముప్తీ హైకోర్టు న్యాయమూర్తి గౌరవార్థపు విందు

నవాబు ఎఖ్బాల్ హుసేన్ ఖాన్ గారు [గోల్కొండ లాడ్జ్, లాల్ టెక్డి, నాంపల్లి] ముఫ్తీ హైకోర్టు న్యాయమూర్తులగు మౌలానాఅబ్దుల్ ఖదీరుగారికి వారు క్రొత్తగా ఆపదవిని స్వీకరించినందునను గౌరవార్థమైవిందు చేసిరి.విందులో పాల్గొనినవారలలో ముఖ్యులుమహారాజాసర్ కిషన్ ప్రసాద్ బహద్దురు, నవాబుముల్ఖదరుజంగు బహద్దురు, నవాబుమిర్జాయారుజంగుబహద్దురు, నవాబు హాషింయారుజంగుబహద్దురు, నవాబు కౌజింయారుజంగుబహద్దురు, నవాబు అక్బరుయారుజంగుబహద్దురు, నవాబు జీవన్ యార్ జంగుబహద్దురు, నవాబు వాజర్ యార్ జంగుబహద్దురు, రాజాబహద్దురు విశ్వేశ్వరనాథ్, నవాబు అహసన్ యారుజంగుబహద్దురు,నవాబు రహమతుయారుజంగుబహద్దురు, నవాబుసుల్తానుయార్ జంగుబహద్దురు, నవాబు మెహిదియార్ జంగుబహద్దురు,మౌల్వి ఫజల్ మహమ్మదుఖాన్, మౌల్వి గులాంఅలీమహమ్మదు,మౌల్విమహమ్మదు అహ్మదు మౌల్వి హెషుల్లరామి అనువారలు.

---

### మున్సఫీ న్యాయాధిగారిదర్జా హెచ్చించబడుట

ఔరంగాబాదుమున్సఫీ తాత్కాలిక గౌరవ న్యాయమూర్తియగు మౌల్వి సయ్యదలీ బి ఏ.,ఎల్ ఎల్.బి.గారికి హైకోర్టువారి సూచనపై దుయ్యందర్జా ఫౌజ్దారిహుకుము ఇవ్వబడినది.

---

## మోటార్లు కొనుటకు ప్రభుత్వ ద్రవ్యమునుండి అప్పులు

ఆర్థికమంత్రిగారి ఆజ్ఞప్రకారము సయద్ ఉస్మాన్ జాఫరు [మున్సిఫు] గారికి మోటారు కొనుటకు రు. ౨౪౦౦ లు హాలీలను యిచ్చుచు వారిమోటారు ఫెడరల్ యక్ ఇన్సూరెన్సుకంపెనిలో బీమా చేయింధనగావించిరి.

మహబూబునగర్ల లోకల్ ఫండు ఇంజనీరుఅగు శ్రీయుత వైద్యగారికి ఖరీదు చేయుటకు రు ౩౦౦౦లు హాలీ గాయిచ్చుచు మోటారుచట్టము జరలు యిన్సూరెన్సుకంపెనీ ... చేయించిరి.




## భిన్న శాఖల సపంక్తి భోజనము

మెహతల్లి

[స్వకీయ వి

గతశుక్రవారము [౧౧- నాడు సికింద్రాబాదులో శ్రీ పడితభుజమువలెనుండు టరావుగారి స్వగృహమున ప్రీతిభోజనమునొసగిరి ఈసం మాలలు. మెహతల్లి సుమారు వచ్చియుండిరి. వైదికభోజనమున వడ్డన చేసిరి.

అందరును విందారగించినకొరువా వెంకటరావుగారు హరిజనులనందరిని గ సపంక్తిభోజనముచేయుచు ఐకమత్యమందుంటకు ప్రబోధించిరి.

* * * *

వెంకటరావుగారు విందుతర్వాత హరిజనులనుసంబోధించి, పండిత మాలవ్యాగారు త్రదీక్షనొసగి హరిజనులను హిందువులలో చ్చుకొనుటకై చేయుయత్నమునిర్వ్యర్థముని హరిజనులు అట్టిపవిత్రులవాయకులు పెట్టుకు లొంగరాదనియు బోధించిరి అని ద్రాబాదు బులెటినుపత్రిక వ్రాయుచున్న

సికింద్రాబాదులో ఇప్పుడేర్పడియున్న వేద్కారు సిద్ధాంతీయులునుయువకమండలి కార్యదర్శియగు పి ఆర్. వెంకటస్వామిగారు సించుచు హరిజనులలోనుండు శాఖాభేదములు తమతప్పులచే పుట్టినవికావనియు, వారు హిందూస్మృతికర్తలే కొరకులని ల సేవకులుగ నున్నంతకాలము తమ బాగుపడరనియు చెప్పిరి. తమలో అంతరభేదములుతొలగి ఐకమత్యము కలుగు స్పరవివాహసంబంధములు, సపంక్తిభో. జరుపుకొనదగుననియు బోధించిరనియు టినుపత్రిక వ్రాసినది.

---

## మహమ్మదు ప్రవక్త జన్మ దినోత్సవము

మహమ్మదుప్రవక్తయొక్క జన్మదినము గతశనివారము [౧౨-౧౦-౪౫ ఫ దును, ఆదివారమునాడును జరుపబడి ద్రాబాదులో ఆ యనుల యా యంకొలము లో బహిరంగస వ్యులగుఫకరుద్దీన్ భాగములను చరి వ్యులగు మౌలా గారును క న్నారి



## ఖూని మొకద్దమాలో సెషను తీర్పుఖాయమగుట

(హైకోర్టులో)

హైకోర్టు న్యాయమూర్తులగు నవాబు మిర్జా యార్ జంగు మరియు నవాబుఅస్గరుయార్ జంగు బహద్దరుగారల సాన్నిధ్యము న ౧౩ నవంబరు ౧౯౪౫ ఫ. ౹౪రోజు తేలిన ఖూని మొకద్దమాలో యావజ్జీవ కారాగార శిక్ష విధించిరి.

ఖూనీవివరములు

తుల్జాపూరు తాలూకలో చేరిన ఉరువాడ అను గ్రామమున ౪ బహమన్ ౧౩౫౪ ఫ ఉదయము నాలుగుగంటల కాలమున సుంకశాఖ జవానుఅగు యశ్వంతరావు భార్యచంపబడెను. పరీక్షవలన కఠిన వస్తువులచే కొట్టబడినట్లు తేలుచున్నది ఖూనిజరిగిన యింటిలో యశ్వంతరావు ఈతని ముగ్గురుచంటిపిల్లలుతప్ప వేరెవ్వరు లేనందున భర్తయేనిందితుడని నెరారోపణ గావించిరి ఈకేసు సెషన్జజుకోర్టులోకి తేబడెను. న్యాయాధికారి భర్తయే నిందితుడని ఆజన్మాంత కారాగారవాస శిక్షవేసిరి దీనిమురాఫా హైకోర్టులో చేయబడెను మురాఫాలో న్యాయమూర్తులు ఈ దిగువ అంశముల నుబట్టి సెషన్జడ్జిగారి శిక్షనే ఖాయపరచిరి "ఈ కేసులో నిందితుని నడవడినిగూర్చి సాక్ష్యములేదు. కాని యితర సాక్ష్యమువలన భర్త దప్ప యితరులవలన నేరము జరిగినదని చెప్పజాలము. శవము దొరికినయింటిలో భర్త,యిద్దరుపసిపిల్లలుతప్పవేరెవరులేరు. డాక్టరుజోషీగారివాఙ్మూలముచే కేవలము దెబ్బలచే మరణించినటు ...చున్నది శవము ప్రక్కన నెత్తురు ...పుగల రాయియొకటి ...మె భర్తయైనను అతనిని ...ను తెలియదని చెప్పెను. ...నేమున తీసుకొనబడిన నేరస్తుని ...వ్యముల వాఙ్మూలమునుండే నేరము ...పడినది. కావున మేము సెషన్జడ్జీగారి తీర్పును ఆమోదించుచున్నాము.

---

## యెద్మండు విడుదల

హైకోర్టులో న్యాయమూర్తులు శివరాజ్ యార్ జంగుబహాదరుగారును, గాజియారుజంగ్ బహద్దరుగారును యెద్మండుపై బలాత్కార సంభోగ నేరములో క్రిందికోర్టువారి శిక్షపై అపీలును విని నేరస్తుని నేరము రుజువుగాలేదని విడుదల చేసిరని వినుచున్నాము.

ఈయెద్మండు తనసొంతబిడ్డతోనే బలాత్కారసంభోగము చేసెనని ఫౌజ్దారీ బల్దాలా అభియోగమురాగా అవిషయమును పత్రికలో ప్రకటించకూడదని ఆజ్ఞయైయుండెను.

---



# హరిజనుల మతపరివర్తన

## అయితరాజు జీడికంటి రామారావుగారు

గుండ్రబల్ల సమావేశానంతరము హరిజనులకు కౌన్సిళ్లలో ప్రవేశమునకు సంఖ్యాప్రాధాన్యతనపైన ప్రభుత్వమువారు హిందూజనసముదాయమునుండి ప్రత్యేకస్థానములు పూర్వకముగ విభాద్యతకై తెలిసిన విధానము పురస్కరించుకొని మహాత్ముడు వారికి కాంగ్రెసు పక్షమునసే అత్యధిక ప్రాధాన్యత నొసగుటకువదలుటకై చేసిన యుపవాస దీక్షకాలమునందు జరిగిన పూనాప్యాక్టునుండి డాక్టరు అంబేద్కరు గారు చెలరేగి హరిజనులను మతముమార్చుటకు ప్రబోధ మొనర్చుటవలన పత్రికాప్రపంచమున నొకకలవరమును హరికలోకము వందు యలజడియు నధికముగా జొచ్చినది ఇటీవల అఖిల భారత హరిజన మహాసభాధ్యక్షుడు అంబేద్కరుగారు ఎన్నికొనబడుట వలన వారు వ్రాసిన అధ్యక్షోపన్యాస తీవ్రధోరణికిసభాకార్యనిర్వాహకులు భీతినొంది ఆ మహాసభనే విరమింప జేయుట వలన మరింత తీవ్ర ఆందోళన కాస్పదమైనది.

ఈ సంచలనమందు మా గోలకొండపత్రికా నిర్వాహకులను ప్రవేశించి తమ పత్రికారత్నమునందు ఈ విషయమైన యమూల్యోపన్యాసములకు తావొసంగినందుకు మిక్కిలి ప్రశంసాపాత్రులై యున్నారు. విచారించి చూడఇదియొక విచిత్రవిషయమో దంతముత్పన్నమైనట్లు తోచకమానదు. గుండ్రబల్ల సమావేశాత్పూర్వము అసహాయోగ సంరంభమును మహాత్ముడుపక్రమించినంతవరకు భారతభూభాగమునందు హరిజన సమస్యయుండిట్టి సంఘర్షణ యుత్పత్తికానేలేదు. చాలవరకీవిషయము నందందరికిని ప్రసక్తికూడ కలుగలేదని చెప్పవచ్చును. భారత జాతీయతాభ్యుదయత కవతరించిన గాంధీమహాత్ముని నిర్మాణకార్య విధాన పరంపరలోని హరిజన సమస్య ప్రత్యేక శ్రద్ధతో ఉచ్ఛయుచ్ఛారణలోనికి రావచ్చినది. దేశాభిమానవర్గమున కింతకు పూర్వమునుండి వీరియెడల సాదర భావముండి యుద్ధారణ ప్రయత్నము అక్కడక్కడ యత్కించిత్ చేయబడుచున్నను సర్వతోముఖ వ్యాపకముగా మహాత్ముని దుందుభినాదమునుండి ప్రతిధ్వనింప బడినది ఆదివరకు జంకుచు కొంకుచు, నున్నవారు ముందు వంకించుటకును, చాటు మాటున నుండి యభిమానించినవారు సాహసమునవలంబించి యుత్సాహోద్రేకములతో బహిరంగ సహాయము నొసగ సాగిరి.

దేశమునందంతటను సయుదారసానుభూతియంకురింపసాగినది. పల్లెల జానపదులు కూడ మహాత్ముని ప్రబోధసారాంశము గ్రహించి సముద్ధరణోద్దేశములుప్పొంగించసాగిరి. ...దేశానుసరణిగ హరిజనులకు బెద్దకాలమునుండి చేసిన పరాభవ పరిహారార్థముగ, ప్రాయశ్చిత్తార్థముగ సవర్ణులు వారి సేవావ్రతమును బూనుకొనసాగిరి. ఎన్నో పాఠశాలలు స్థాపింపబడి విద్యనుగరపుచున్నారు. ఎన్నో ఆరోగ్య సౌకర్యములమర్చుచున్నారు. ఎన్నో సమాజములందు సభ్యత్వమొసగుచున్నారు. ఎన్నో దేవాలయములందు ప్రవేశార్హత నిచ్చుచున్నారు. నేయేలఇంచుక ప్రాపంచిక విజ్ఞాన సంపత్తిగల ప్రతిమనుష్యుడును హరిజనోద్ధరణసేవతో కృతార్థత, సాఫల్యత నొందవలయునని సంకల్పించుకొనుచున్నారు. పరమాత్ముని సేవతోపాటు హరిజనసేవయని తలంచుచున్నారనుటలో నతిశయోక్తి లేదని చెప్పవచ్చును.

శతాబ్దములనుండి జరుగజాలనిమార్పు అతిస్వల్పకాలములో మహాత్మునియద్భుతమహిమాప్రయత్న ఫలితముగ గలుగుచున్న యిక్కాలమున అంబేద్కరుగారి వేగిరపాటుతో గూడిన యసంతృప్తి, మతమును మార్చుటనుగూర్చిన హెచ్చరింపు, వారి యనుచరబృందము చేయుతారనాపము దేశమునందుమహాత్మునికృషి విస్తరముకంటె యత్యంత ప్రమాదప్రాప్తి సౌభాగ్యకలతాయను విషయమును మనము చూచుచు గ్రహించుచున్న సంగతులవలన యాలోచించుటయిప్పట్ల ననవసరము. హరిజనోద్ధరణకు మహాత్ముడేర్పరచిన మహత్తర ప్రబంధములవల్ల గావింపబడుచున్న నిప్పటి ప్రచారమునకు మించి వీరు మతమును మార్చవలయునని చేయుతొందరపాటువలన హరిజనులకేమి సద్యఃఫలితము కలుగునో, మరియునిట్టి బెదిరింపులిప్పటియునేమియవసరమో యూహాగమ్యముగనున్నది

అఖిలభారతమునగల ౭కోట్ల హరిజనులలో పదుమూడువీసములు పల్లెటూరు నివాసము గలవారైయున్నారు శతాబ్దముల నుండి హిందూ సవర్ణులు వీరిని వెలివాడలందు నివసింపజేసి యస్పృశ్యులుగా నవమానించి బాధించుచున్నను ఇందువలనకలుగుకీలుగులను తప్పించెదమని కోటానకోట్లు రూప్యములనుపెచ్చించి చర్చిమిషనులను స్థాపించి బ్రిటిషుప్రభుత్వారంభము నుండి శతవర్షములనుమించి కృషిచేసినను మన దేశమునందు ఏబది లక్షలకంటె నధికము గా క్రైస్తవులనుగా మార్చలేకపోయినది యనుభవైకవేద్యమే. వీరైనను నామ మాత్ర క్రైస్తవులేగాని హిందూత్వమునుండి పూర్తిగావిడిపోయియుండలేదు. ఉద్ధరణను బొందినవారని చెప్పుటకేమాత్రము వీలులేదు క్రైస్తవులలో చేరినంతమాత్రమున వెలివాడలనుండి యూరిలోపల ప్రవేశించి సవర్ణులతో యస్పృశ్యతేగా సంచరించుట ఎంతమాత్రము లేదు వారియాధ్యవతనము వారింపబడపోయినను హిందూపేరు, క్రైస్తవనామము రెంటిను వహించి హిందూదేవతల గొల్పుచు క్రైస్తవప్రార్థనల దల్చుచు హిందువులకును క్రిస్టియనులకునుభోవారుగానచ్చుచు కొన్నిదినములు ఇందునుఅందును గామూరుచు ద్వంద్వవైఖరులగుచున్నారు. ముందుగూడ అంబేద్కరుగారు తదనుయాయుల ప్రేరణతో నిల్లు మార్పు చెందినవారు పూర్వపువాసలోపనే చెక్కుచెదరక ఆదేగూడెములలో నట్టే తొలగితొలగినడచుచు ఉద్ధయమత పీడనలతో ...లించుటతప్ప ఇప్పుడేఅధిక తరదశాసంప్రాప్తికిని బొందజాలరు. మరియుపల్లెటూళ్లలోని హరిజనవద మింతశీఘ్రనంతముగా తరతరములనుండి యభ్యాసముగా నున్న హిందూమతమునువీడి మతాంతరసభ్యతను ఏకమాత్రముగ ననుభవింపనుగూడజాలరు. ఇక మహమ్మదీయమతములోజేరదలచినను ఇంతకంటె యధికసత్కారమును వారను ఈయజాలరని తలంచవలయును. యత్కించిత్ గౌరవము,ఆదియుఎరిగి కోరదువారికి ఏకొ-దిమందికో వారియరమైన యునికినిబట్టి పేపట్టణస్థలములలోనో దొరకినదొరకునుగాక గాని అది మహాత్ముని కృషితోగలిగెడు యభివృద్ధిలో శతాంశమైనకానను సరిపోజాలదు భారతదేశమునందలి మహమ్మదీయులు ఇలము వీరినిహిందువులవలె నస్పృశ్యతతోజూచుటకే యభ్యాసపడియున్నారు గౌరవించే మహమ్మదీయులైనను గౌరవింపబడు మతపరివర్తకహరిజనులైనను వేళ్లపైలెక్కింపబడుసంఖ్యామాత్రమువారే యుందురు. గాని గ్రామగ్రామములందు నీవ్యవస్థ వీరిమార్పువలన కుదురునదిగాదు. ఈమధ్య నాతో ఖమ్మము మెట్టు రాచకార్యమునకు కొందరుహరిజనులు రాబడియుండి వేసవియగుటవలన దప్పయధికముగుటచేనొకమహమ్మదీయ చలివేంద్రమునందు దాహమునార్చుకొనుటకై తెలగాలమని మంచి నీటిని యడిగియుండిరి. అక్కడమహమ్మదీయులు వారిని కుండలములో నీరుతీసుకొని త్రాగమని శలవిచ్చినందువనొకరిద్దరు జలమునుగ్రోలిరి. అపిమ్మట ఎట్లోవారు వీరిని మాదుగులుఅని యనుమానించి శసలపీయకనిల్పి కుండలుమైలపడినవనియాక్రోశించి పోలీసువారికొప్పగించి తన్నించెదమని బెదరించుచుండగా వారి కికుండలవెలయిచ్చి విడిపించుకొనవలసివచ్చినది. ఇట్టివారిని పల్లెలలోని మహమ్మదీయులు సోదరముగా తమలోకలుపుకొని సమత్వముగా ఆశ్రయముగా సంచరించుట కేమాత్రము సంసిదులు గానందున నారావాహలను మహమ్మదీయులసాహాయులువారినే పూర్తిగా మహమ్మదీయులుగా అంగీకరింప నొకతెగగా మహమ్మదీయుకలు పల్లెలలో ప్రత్యేకముగా స్థాపియించియున్నారు వారు సగముహిందువులుగను సగము మహమ్మదీయులుగను సంచరించుచుందురు.

ఇట్టిస్థితిలో ఇన్నికోట్ల హరిజనులకు తమ సౌకర్యములుకొని యస్పృశ్యతను నిర్మూలించు భారమును ఇతరమతములలోని భారతీయులుగా మారి జానపదులను భరించసంసిద్ధముగా లేరనియు, అట్లుగా నొక్కమ్మడి వీరిసంతోషనలను తలకెక్కించుకొని పురాతనమునుండి మనచున్న హిందూమతమును వదలుటకుగాని, హిందూజానపములతో అనాదినుండియుండి వారితో సంబంధించి జీవించుచున్న జీవితవిధానములనువీడి క్రొత్తవ్యవస్థను సర్కించుకొనుటకుగాని. పల్లెలలోని యీ కేవసంఖ్యాక హరిజనవర్గమెంతమాత్రము సంసిద్ధము గాలేరనియు అనుభవము వలన నెరుంగవలయును. ఇక భారతదేశములో నీహరిజనుల కొరకు నెచ్చు బౌద్ధ, జైనమతాదులు గతిప్రసంఖ్యామాత్రము. ఇయ్యవి గ్రామములలో నెల్లున్నవారి నెల్లుంచుననియే గాని వారిని ప్రకోపనీని హిందూసవర్ణులతో తుల్యులుగచేయు శక్తింతమునైనవి గావు. అట్టి స్థితిలో ఎక్కడెప్పుడుపుట్టినదో అక్కడనే మార్పుకొనవలయునను సాహెతనుసరించిహిందూమతమునకు బాధకరమగు స్వీకారమును నిందుండియే మార్పులకు బూనుకొను టుచితవిషయము గాని మతమును మార్చినందువలన శీఘ్రకములాభమునుసంతయులేదు ఒకవంక హిందూమతశాస్త్రములను మహాత్ముడు కడిగిపారంచి యస్పృశ్యతావిషయము ప్రత్యేక జాతివ్యవస్థగాలేదని సిద్ధాంతీకరించి హరిజనసముద్ధరణకు ...కంకణబద్ధుడైయుండి దేశమును, దేశనందలి సవర్ణులను, మతోద్ధారకులను, ఆచార్యపీఠస్థులను నామాదిని సుముఖ్యులుగా మారుచు హిందువులను పశ్చాత్తప్త హృదయులనుగా మార్పుచువచ్చుచుండ నింక కొద్దికాలమోపిక నువహింపక మతమును మార్చినందువలనకలుగు శాశ్వతక్షేమలాభమేమిగలవు ఇకనీహెచ్చరికలు నట్టిబెదరింపులేనను కొలయును, లేకఅనుభవమైన యుపోకల్పనలైనను కాసలయుచు

### దేవరకొండ వకీళ్లసంఘ

పునరుద్ధరణము

దేవరకొండ వకీళ్ల సంఘము పునరుద్ధరించబడి క్రొత్త సభ్యుల నేర్పరిచిరి. నిబంధనలు తయారు కాబడుచున్నవి. హైదరాబాదువకీళ్ల సంఘములో కలిసియుండుటకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. యిదివరకు న్యాయస్థానమున వకీళ్ల గది ఏర్పాటులేకుండెను. కానిఇప్పుడు ప్రత్యేకముగా విశాలమైన గది యొకటి ఏర్పాటుచేసి ఫర్నీచరుకూడా తెప్పించినటుల తెలియుచున్నది. నూతనముగా ఈక్రింది సభ్యులను ఎన్నుకొనిరి.

(౧) కొండల్ రావు వకీలు హైకోర్టుఅధ్యక్షుడు,
(౨) లక్ష్మీనరసిమ్మారెడ్డి వకీలు ఉపాధ్యక్షుడు,
(౩) యల్లయ్య వకీలు కార్యదర్శి,
(౪) వీరయ్యగుప్త వకీలు సహాయకార్యదర్శి

### "భక్తజనోజ్జీవనము"

ఈగ్రంథము కంద్లూరు వేంకటజోగారావుగారిచే రచియింపబడినది దీనిలో హరినామరచనలు, శ్లోకము మరియుపద్యములు టీకాతాత్పర్యసహితముగా నిమిడియున్నవి. భక్తసమజములకు, భజనమందిరములకు ఉచితముగాం పంపబడును. వలయువారే టపాఖర్చులు భరించవలయును. యితరులకు రు.౦-౪-౦ కాపీకి విక్రయించబడును. వలయువారు యీదిగువ రునామాకు వ్రాసిన బడయగలరు.

కంద్లూరు వేంకటజోగారావు
బాణాపురం పోస్టు దేవరకొండపల్లి
తా॥ ఖమ్మం జి॥ వరంగల్లు




# గోలకొండ పత్రిక

ధాత నామ సం౹౹ శ్రావణ శు౹౹ ౫

గురువారము


## రామలింగారెడ్డి గారి ఆదర్శము

—:o:—

జగద్విఖ్యాతులైన కట్టమంచి రామలింగారెడ్డిగారు ఇటీవల ఆంధ్రవిద్యాపీఠపు ఉపాధ్యక్షపదవిని పొందినది అందరికిని తెలిసిన విషయమే. వారు మొన్ననే తమ జీతములో సగము మాత్రమే తానుతీసికొని మిగతజీతమును విద్యాభివృద్ధికై యేదేనొక విషయమున వినియోగింప నిశ్చయించిరని వినుటకు చాలసంతోషమైనది. హిందూస్థానములో విద్యాసమస్యలపై అధికారయుక్తముగు అభిప్రాయమిచ్చుట కర్హులైన కొలది గొప్పవారిలో వీరొకరు. వీరు బహుభాషా పండితులు. ఆర్థిక శాస్త్రమందు ప్రవీణులు ఉపన్యాసము లిచ్చుటలో— అందు హాస్యరసము చిప్పిలజేయుటలో — అద్వితీయులు ఆంధ్రభాషకు మహోపకారముచేసిన వారు. మైసూరు విద్యాపీఠ స్థాపనము లోని ప్రధానులలో నొకరు. దేశభక్తి కలవారు. కాని వీరుచేయుపనులన్నియు సరియైన కాలమున గాక తప్పుసమయములో చేయుట వీరిచరిత్రలోని ముఖ్యఘట్టము.

ఇట్టివీరు చూపించిన త్యాగము, దేశసేవాపరాయణత ఆదర్శప్రాయమై యున్నది. ఈదేశములో జీతములు హెచ్చులయినను సాధారణముగా తగిన స్థలమునకు తగిన అధికారి లభించుట సాధారణముగా గోచరించదు. అనేకాధికారులు "ముసాఫర్ల"మని భావించుకొనువారు. తమకు కావలసినది జీతమే యనువారు కొందరు.

ఆర్థికమాంద్యముపట్టి నానాప్రాంతములలో నానావిధములగు సలహాలోచనలు జరుగుచున్నవి. ప్రభుత్వవ్యయమును తగ్గించుటకై యెన్నెన్నియో ఆలోచనలు చేయబడినవి. తుదకు "కవర్ల" (జాబులు వ్రాసికొను లిఫాఫాల) పై దృష్టిపారినది. వాడిన కవరునే వాడిన ఖర్చుకొంత తగ్గునట! కాని రు. ౨౦౦ పైగా నెలజీతములు పొందునట్టి అధికారుల జీతములలో నూటికి ౧౦ వంతున తగ్గించిన నేమూ హో! నూటికి ౧౦ వంతున తగ్గింపగ కొన్నకొనని వారు నూటికి ౫౦ వంతున స్వయముగా వదలుకొనినట్టి రెడ్డిగారిని గురించి యేమనుకొనుచున్నారో దేవుడే మోపాపము.

కావుననే శ్రీ రామలింగారెడ్డిగారి చర్యను నిజమైన త్యాగమని చెప్పిన తప్పుకానేరదు. సాధారణముగా మన దేశములో ఉద్యోగములుచేసిన గొప్ప గొప్ప ఆంగ్లేయాధికారులలో ననేకులు ప్రజాహిత సంస్థల నందందు స్థాపించి పోయినారు. లేక స్థాపించుటకై యితరులను ప్రోత్సహించి సహాయపడినారు. కావుననే వారిపేర అనేక సంస్థలు అనేక స్థలములలో కానవచ్చుచున్నవి! కాని భారతీయులు స్థాపించిన సంస్థలు అంతవిరివిగా కనబడుటలేదు.

శ్రీ రెడ్డిగారివంటి యధికారు లందరును అంత త్యాగముకాకున్నను కొంతయైనను త్యాగముచేసిన మనదేశములో విజ్ఞానాభివృద్ధి త్వరలో కాగలదు. నిజాంరాష్ట్రాధికారులును ఈ విషయమును గమనింతురు గాక.

—

# వితంతు వివాహ శాసనము అంగీకరింప బడుట

## హైదరాబాదు శాసనసభ

(మా ప్రతినిధి)

హైదరాబాదు వ ౧౬ నవంబరు—నేటిఉదయం గం 9–30 నిమిషములకు శాసనసభా సమావేశము జరిగెను. యీక్రింది సభ్యులు హాజరు అయిరి.

౧. నవాబు మిర్జాయార్ జంగు బహద్దరు
౨. నవాబు జుల్కదరుజంగు బహదరు
3 నవాబు ఫఖురుయారు జంగు బహద్దరు
౪ నవాబు హసన్‌నవాజుజంగు బహద్దరు
౫. నవాబు సమద్‌యార్ జంగు బహద్దరు
౬. రాజాబహద్దరు విశ్వేశ్వరనాథ్ గారు
౭. రాజాబద్దరు నారాయణరావు గారు
౮. రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు ఒ. బి. యి.
౯. నవాబు హిమ్మత్‌యార్ జంగు బహద్దరు
౧౦ వినాయకరావు విద్యాలంకార్ గారు
౧౧. కేశవత్తవామన్ రామచంద్ర నాయక్ గారు
౧౨. మీరు అక్బరలీఖాన్ బారెట్‌లా
౧3. నవాబు ఖుత్బలీఖాన్
౧౪. ఖలీలుల్ జమా బారెటులా
౧౫. నవాబుగయాసుద్దీన్‌ఖాన్

సమావేశములో యిదివరలో చర్చింపబడి, యీసభలో ఆమోదము బొందుటకై యున్న యీక్రింది శాసనము అంగీకరింపబడినవి.

౧. ౭ కొర్టు అఫ్‌రైట్సు [అనగా భూములహక్కులను వ్రాసియిచ్చుటకు]
౨. ఫౌజ్దారిబాకీతాల సవరణలు
3. రిజిస్ట్రి శాసనము యొక్క—సవరణ
౪. స్టాంపు శాసనము
౫. కంపెనీల శాసనము
౬. దివానిజాబతా
౭. మునిసిపాలిటి [పురపాలకసంఘము]
౮. వకీళ్ల శాసనము
౯. హిందూ వితంతువుల పునర్వివాహము బిల్లు 3

### వితంతు వివాహ శాసనము ఆంగీకరింపబడుట

ఈక్రింద వివరింపబడిన శాసనము రాజా బహాదరు నారాయణరావు గారి సవరణలతో నంగీకరింపబడినది.

౧ హిందూవితంతువు ధర్మశాస్త్రసహితముగా హిందువుకు వివాహముచేసికొని కనినసంతతిని ధర్మశాస్త్రములయందు పౌనర్భవులనియే ట్టివారిక్కులు నిర్ణయింపబడియున్నవో అట్టిహక్కులుండవలెను

౨. సదరుబిల్లులో వివాహముఅని వాడబడినచోట పునర్వివాహమని వాడబడవలయును

3. చిత్తుశాసనము యొక్క ౬ వ దఫాలో వివాహముచేసికొనిన వితంతువు అనుచోట మొదటిభర్తయొక్క ఆస్తియని యుండవలయును. ఈప్రకారము అదరుశాసనము జయప్రదముగా నంగీకరింపబడెను.

#### చర్చింపబడిన చిత్తు శాసనములు

తరువాత యీక్రింది చిత్తు శాసనములో ౧, ౨, 3 లను పైశాసనమువలె అపబడినవి. ౪, ౫ శాసనములుచర్చించి సెలెక్టుకమిటి నివేదికకై యొసంగబడెను.

౧. కంపెనీలశాసనము
౨. ఫీనల్ కోడ్డుయొక్క— 30౭ సెక్షను
3. గార్డియన్సులక్టు (సంరక్షకత్వము)
౪ మెడికల్ ప్రాక్టీషనర్లను రిజిస్టరుచేయుట
౫. ప్రభుత్వమువారు అవసరమైనప్పుడు జనుల భూములను తీసికొనుటను గురించినశాసనము.

౪వ చిత్తుశాసనము ననుసరించి వైద్యవృత్తిలో పరిక్షనిచ్చి సర్టిఫికెట్లు పొందినవారిపేరు లనుమాత్రమే రిజిస్టరులో నమోదు చేయుటకు సూచింపబడెను. దానిమీద చర్చజరిగి సర్టిఫికేటులవారికే గ్లినను, ఇబ్బందిలేదనియు, అనుభవముగల యునాని, ఆయుర్వేద వైద్యులను గూడ సదర్ రిజిస్టరులో నమోదు చేయుటకును కోరబడినది.సమర్థతా సమర్థతలు ఉభయులయందు ముగలవనియు లోకులకు ఉభయులవల్లను మేలుగలవనియు, గనుక అవసరమైన రెండురిజిస్టరులుంచి ఉభయులును రిజిస్టరు చేయవలసినదిగ చర్చసాగినది. అందుమీదట ఈవిషయమువిచారించిని వేదికతయారు చేయుటకు ఈక్రింద గౌరవసభ్యులలో నొక సెలెక్టు కమిటిని నియమించిరి.

౧. నవాబు సమయారుజంగుబహాదరు
౨. నవాబు [illegible]గోడలోన్ ఖాన్
3. రాజాబహాదరు వేంకటరామారెడ్డి ఒ. బి. యి
౪. రాజాబహాదరు విశ్వేశ్వర్ నాథ్
౫. రాజాబహాదరు నారాయణ్ రావు
౬. ఖలీలుల్ జమా బారెట్‌లా
౭. మీరుఅక్బరలీఖాన్ బారెట్‌లా
౮. నవాబుహసన్ నవాజుజంగు బహద్దురు

౫వ చిత్తుశాసనము చర్చకువచ్చినసందర్భములో ప్రజలయొద్దనుండి భూములనుతీసుకొనునప్పుడు కొంతకాలనిర్ణయము శాసనములోనే ఖండితముగా నిర్ణయింపబడవలెననియు సదరు నిర్ణయముప్రకారము యొకరియొద్దనుండి ప్రభుత్వమువారు భూమినిస్వాధీనము చేసికొనదలంచి, రో అట్టివారికి ముందుగానోటీసునిచ్చుటకును సదరునోటీసులో కాలనిర్ణయము చేయబడవలెననియు సదరునిర్ణయముదాటినయెడల అట్టి నోటీసులోని కార్యక్రమము రద్దుచేయబడినట్లుగా భావింపబడవలెననియు లేనియెడల ప్రభుత్వాధికారులవల్ల యెంతకాలమునకును విషయము తేలకుండున ప్రజలకు చాలాయిబ్బంది కలుగవనియుచర్చజర్పగినది. అందుమీదట యీవిషయమునుగూడ విచారించి, నివేదిక యొసంగుటకు యీక్రింది గౌరవసభ్యులలో నొకసెలెక్టు కమిటి నియమింపబడెను.

౧ నవాబుసమదుయారుజంగు బహాదరు
౨ రాజాబహాదరు వేంకటరామారెడ్డి ఒ. బి. యి
3. రాజాబహాదరు విశ్వేశ్వర్ నాథ్
౪ దేశభక్త వామన్ రామచంద్రనాయక్
౫ మీర్ అక్బరలీఖాన్ బారెట్‌లా
౬. నవాబుఖుత్బలీఖాన్

పైచిత్తుశాసనములు చర్చింపబడిన యూనభ నవంబరు ౧౯ నకు వాయిదా వేయబడినది.

## జటప్రోలుసంస్థానము వివాదము

మనోవర్తి దరఖాస్తు కొట్టివేయబడినది

ప్రస్తుతము జరుగుచుండిన జటప్రోలు సంస్థానపు విరాసత్తువాదానికి సంబంధించిన మనోవర్తి దరఖాస్తు అలియాతు జాజం మౌల్వీ అబ్దుల్ బహదుఖాన్ గారివల్ల కొట్టివేయబడినది. ఆవివాదముయొక్క— వివరములు యీక్రింద క్లుప్తముగా నివ్వబడుచున్నవి. జటప్రోలు రాజాగారు చనిపోయినతరువాత, సదరురాజాగారు వ్యాయముగా పెంచుకొనియున్న రాజా వెంకటజగన్నాధరావు గారు వుండగా రామచంద్రరావు సర్వనారాయణరావు అనువారలు చనిపోయిన రాజాగారికి పుట్టినకుమారులమనియు జటప్రోలు సంస్థానము తమదనియు నొకవ్యాజ్యము తెచ్చిరి. అందుమీదట ఆలియాతు నాజిం సాహెబుగారు ౧3౪౧ ఫసలీలోవారిని సివిలుకోర్టునకువెళ్లి తీర్పు చేయించుకొనవలెనని. అందుమీద యక్సిక్యూటివు కవున్సిలుకొక అపీలు చేయబడెను. కవున్సిలువారు తిరిగి మొదటికోర్టుకు సాక్ష్యము వగైరాలు విచారణకొరకు పంపిరి. దావా విచారణలోయున్నది.

సదరుదావావిచారణ అయికోర్టువారి నిర్ణయముఅయ్యేలోపల అపీలుదారులు తమకు చనిపోయిన రాజాగారు నెల ౧కి రు. ౧౦౦౦ లు ఇచ్చుచుండిరనియు ఆదేశప్రకారము సదరుదావాపరిష్కారము అయ్యేవరకు మనోవర్తియిప్పింపవలెననియు ఒకదరఖాస్తు దాఖలు చేసిరి.అందులో అర్జీదారులు తమకు ఆర్థిక విషయములలో చాలావస్తడిగా యున్నదనియు యిదివరకు వారు పొందుచున్నదిగాక యింకొవృద్ధిగా యిప్పించమనియుకోరిరి, పిటిషనరుల తరపున రాజాబహాదరు క్రిష్ణమాచారియరు వకీలుగా హాజరుఅయిరి.

పెంపుడుకుమారుల తరపున వకీలుగామిసరు. అర్. యస్. నాయక్ గారు మాట్లాడు- షనర్లు చనిపోయిన రా[illegible]
నియు వారికెట్టిఏలవెన్సు „
యు రాజాగారి వీలునా. ..
తాము ఆదివరలో యిస్తూవున్నట్లుగా ముందు యివ్వబడవలెననిగాని వ్రాసీదనియు, రాజాగారు తాముదస్తుచేసిన దు ప్రమాణముగాను, స్పష్టముగాను తమకు కేమియుడు లేదని ప్రకటించెననియు వాదించెను. ఇదిగాక మిస్టరునాయక్ గారు యిదివరలో నాజంసాహెబువారు పిటిషనరులను సివిలుకోర్టుకు పొమ్మనిచెప్పిన తీర్పుయిప్పటికిని విలువగలదనియు చెల్లతగినదనియువాదించెను.

రాజాబహాదరు క్రిష్ణమాచారిగారు యెదురువాదనలో యెక్జిక్యూటివు కవున్సిలువారు అపీలును అంగీకరించిరిగనుక క్రిందికోర్టువారికి ర్మానము విలువలేనిదని చెప్పుచూ పర్యవసానములో క్రొత్తఉర్డరులను దయచేయించవలెనని కోర్టువారినికోరిరి. కోర్టువారు నమ్ముటకుగాని ఆలోచించుటకుగాని తగిన సాక్ష్యమేమియు హాజరుపెట్టనందున సదరుసందర్భములో జడ్జిగారు దరఖాస్తును కొట్టివేసిరి.

# నీతినియమము లేని భాష నేటి వ్యావహారికపు తెనుగు

## నిరుద్యోగుల పరిశ్రమ నేటి తెనుగు కవిత్వము

మదరాసు క్రిశ్చియన్ కాలేజి తెనుగుపండితుని అభిప్రాయము

మదరాసు నగరమందు ఆంధ్రభాషాభివర్ధక సమాజమువారు ఈజాన్యువరి ౧౬వ తేదినాడు సాయంకాలము పచ్చయప్ప కళాశాలలో నొక బహిరంగసభను జరిపిరి. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు దాని కధ్యక్షులుగ నుండిరి. క్రిశ్చియన్ కాలేజిలో తాత్కాలిక ఆంధ్రోపన్యాసకులగు శ్రీయుత కృత్తివెంటి వేంకటసుబ్బారావు యం. ఏ. గారు "నేటి తెనుగు" అను విషయమును గురించి ఉపన్యాసము చేసిరి.

వేంకటసుబ్బారావు గారి ఉపన్యాసమంతయు చదివిచూచిన, వారికి నేడు తెనుగుభాషారంగమున తాండవమాడుచున్న వ్యావహారిక వేషమున్ను, తెనుగు కవిత్వరంగమున తాండవమాడుచున్న భావకవిత్వ మనబడు వేషమున్ను ఏమాత్రమును ఇష్టములుకావని తోచును.

ఉపన్యాసము యొక్క ఉద్దేశ్యము సుబ్బారావుగారి వచనములలో "పూర్వకాలము తెనుగు ఎట్లుండెనో, ప్రస్తుతమెట్లున్నదో, వీటికి గలభేదమేమో" తెలుపుటయే.

### మొదటి భేదము

నన్నయభట్టు తిక్కనకాలము నాటికి పాశ్చాత్య సాంప్రదాయము లేదు. రాజులు కవులను ఆదరించెడివారు. ఇపుడు కవులకు రాజాదరణ లేదు. అదియుగాక, దేశకాలపరిస్థితులు, ఆచారములు, అలవాట్లు పూర్వముండునవి నేడుమారినవి. కవులు ఈమార్పును బట్టికూడ మారుచుందురు. పూర్వకాలముకవులు తమగ్రంథములను ధనికులను, దేశోద్ధారకులకును అంకితమిచ్చుచున్నారు. నాటకకర్తలు తమనాటకములను నాటకసమాజములకును, సినిమాలకును టాకీలకును అనుకూలించురీతిగా రచించుచున్నారు రెండుగంటలలో సంపూర్ణముగావలసిన రామాయణకథలోనే సంగీతమును, భావమును ఇమిడించుటలోగల కష్టము తెలిసినదే.

### రెండవ భేదము

పూర్వకాలపుకవులు తమ గ్రంథములలో చదువుటకు ఏవగింపుకలిగించు శృంగారమును ప్రవర్తించి పాడుచేసిరని ఆక్షేపణచేయు చిల్లరపత్రికలలోని హేయమునైన వ్యాసముల మాటయేమి. నిజముగా సంఘము పాడుచేయునవి ఇవియే

### కవిత్వదుస్థితి

ఒక చిల్లరకవులమాట వీరు కడుపులో త్రముకొఱకు కవిత్వముచెప్పుచుందురు. ఎన్నికల ప్రచారమునకై ఒకపత్రికస్థాపించి తమపార్టీప్రచారమునకుఅనుకూలము గాపంచరత్నము ల వ్రాయుచుండెడి వ్రాసెడువారు నిరుద్యోగులనుండి నేడుతయారగుచున్నారు. అట్టిడ్రామాలు, ఇటు కవిత్వము ఏమిపనిలేనివారలు కల్పించుకొని పనిగానున్నవి. ఇట్టికవుల కవిత్వములో భావము ఉండదు

### వ్యావహారిక భాషావాదులు

ఆంగ్లేయులు వచ్చిన తర్వాత మనపట్టణముల పేర్లుకూడ మారుచున్నవి విశాఖపట్టణము "వైజాగ్" గా మారినది. గుంటూరు గంటూరు మారును పదము మారుట వలన పదమునకున్న అర్థము మాయమగును ఆంధ్రభాషను ఆంధ్రదేశమున వున్నవారందరును ఒకేమాదిరి ఉచ్చరింపరు. రావుగా పనిచేయుట, రొంపికష్టము, ఏంది, అంటాగా, ఇట్టా, మున్నగుపదములు ఆయాప్రాంతముల వారికి నచ్చునేగాని మిగత వారికినచ్చవు పూర్వము ఈ వాడుక భాష గ్రంథములలోనికి వచ్చునదికాదు ఇదివరకు భాషకు ఒక స్టాండర్డు, [సూత్రప్రమాణము] ఉండెడి నియమము లుండేవి భాషకు నాయకులుండేవారు ఇదివరకు పండితులకు నిర్మల హృదయముండెడి నేడు లోపల సరుకున్నా లేకపోయినా వేషముతో లోకమును మోసపుచ్చి పామరుడు పండితుడగు చున్నాడు

### బళ్లలో తెలుగురాని పండితులు

ఇపుడు బళ్లలోను కళాశాలలలోను ఆంధ్రభాషలో పరిచయము లేనివారే ఆంధ్రభాషకు గురువులగుచున్నారు. సంస్కృతము వచ్చినచో ఆంధ్రభాషవచ్చినట్లే అని చాలమంది తలచెదరు. ఆంధ్రభాషను సుకవిశతకముతో ప్రారంభించిన వారికిని ఈ సంస్కృత పండితులకును చాలభేదముండును తెనుగుభాషలో చాదుభావగర్భితములైన పదములకు సరియైన అన్వయము ఈసంస్కృత పండితులకు తెలియదు.

### గాయకులుచేయు అపరాధము

సంగీతవిద్వాంసులు కొందరు తెలుగులో పరిచయము లేనివారు తమ పాడుకీర్తనల కర్థము తెలియక విపరీతార్థము వచ్చునట్లు పదములను విరదీసిపాడుచున్నారు. తెనుగు తెలిసినవారు ఆపాటవినుటతటస్థించిన చిక్కువచ్చును. కావున సంగీతముతోగూడ సాహిత్యము చేరిననే ఆంధ్రభాష వృద్ధిగాంచును.

### పత్రికల దోషములు

పత్రికలు గ్రంథములనిపించుకొనవు గనుక వాటిలోని లోపములు ఒకలెక్క లోనివి కావు.

### నిజమైన కవి

చిల్లర కవులకు కవుల జాబితాలోచేరు అర్హత ఉండదు. శాశ్వతముగానుండు గ్రంథములను రచించినవారే కవులనిపించుకొందురు. కవికి సంగీతమున ప్రవేశము ఉండవలెను. లోకానుభవము అవసరము అది ఇది అననేల ప్రతికళలోను కొద్దిగనో గొప్పగనో తెలిసియుండుట అవసరము.

### అధ్యక్షుల అభిప్రాయము

ఇట్లు సుబ్బారావుగారు ఉపన్యసించి ముగించిరి. పిమ్మట దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు లేచి తమ అభిప్రాయమును విశదముగా చెప్పిరి. మొత్తముమీద చూడగా కృత్తివెంటి వేంకటసుబ్బారావుగారి అభిప్రాయము వారిదే, నాగేశ్వరరావుగారిదే వారిదేయనియు రెంటికిని ఏమాత్రము పొత్తుకుదురదనియు తేలుచున్నది. ఆంగ్లభాషకే ఎక్కువకాలము వినియోగించుదుము, మాతృభాషకు తగినంత కృషి లేనందువలన ఏర్పడిన పరిస్థితులకు తగినగ్రంథములే నేడుపుట్టుచున్నవనిరి. వాడుకభాషలో పద్యములను వ్రాసిన అప్పారావుగారి వంటివారలు పలువురుగలరు "ఇదిక్రొత్తపోకడ పూర్వకాలపుకవుల గ్రంథము లనుకరించి క్రొత్తపోకడలకుపోలికలేదు. కొద్దిపాటి పాండిత్యముతోనే నేటికవులు తమ ఆత్మానందముకొఱకు కవిత్వ చెప్పుచున్నారు ప్రజాభిప్రాయము దేశకాల పరిస్థితులుమారినవి. అప్పుడు అనుగుణముగా ఆంధ్రభాష అభివృద్ధి గాంచుచున్నది. . ... దేశభాషలలో అభిమానము హెచ్చిన కొలది రాజకీయ, సాంఘికపరిస్థితులలో "మార్పులు కలుగును. వీటికన్నిటికిని ముందుగా స్వాతంత్ర్య మత్యవసరము ప్రజలలోస్వాతంత్ర్యాభిలాష కలుగజేయువారుకవులే. . ఇంతేగాను తెలుగుభాషలో పాండిత్యము సంపాదించుట ప్రతివారికిని అత్యవసరమగును ఏపనులు చేయుటకైనను దేశభాషలో పాండిత్యము ఉండవలెను. తెనుగువారైయుండి తెనుగులో పాండిత్యములేకుండిన తెనుగువారిచే గౌరవించబడరు." అని నాగేశ్వరరావుగారు చెప్పిరి.

---

## రెడ్డిసామ్రాజ్య దినోత్సవము

### ఆంధ్రేతిహాస పరిశోధక మండలి జరుపదలచుట

ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారు ౧౦వ సంపుటము "జయంతిరామయ్యగారి జ్ఞాపకసంపుటము"గా ప్రకటించుదురని తెలియుచున్నది. ఇదివరకే ప్రకటితమైయుండవలసినది ద్రవ్యలోపముచే ఆగియుండెను. ఇదేగా౧౯౪౩-౪౪ వ సంవత్సరములోనే ౧౧వసంపుటముకూడ ప్రకటించబడును.

అంతేగాక ఈసంవత్సరము రెడ్డిసామ్రాజ్య దినోత్సవము జరుపుటకు పైమండలి యొక్క కార్యనిర్వాహక వర్గమువారు గతసంవత్సరమే తీర్మానించియుండిరి. ఆఉత్సవము జ్ఞాపకముగనుండుటకై తెలుగుభాషలో రెడ్డి సామ్రాజ్యకాలపు చరిత్రనుగురించి ఒక సంపుటము ప్రకటించబడును. ఇది ఇదివరలో వెలువడిన కాకతీయసంచికల పోలియుండునని తెలియుచున్నది.

### ఆంధ్ర వైద్యమండలి

ఈమండలియొక్క స్థాయిసంఘ సమావేశము ౧౧జనవరి శనివారము ఉదయము ౯గం॥ మొదలు ౧౨గం॥వరకును, మధ్యాహ్నము ౨గం॥మొదలు ౬గం॥లవరకును అనకాపల్లిలో రాజవైద్యశిల్ల చిన్నాపాత్రోగారి అధ్యక్షతన వారి"చండీఆయుర్వేద భవనము"న జరిగెను. సుమారు ౨౦తీర్మానములు ప్రవేశపెట్టబడెను. ౧౯౪౪సం॥పు ఆంధ్రవైద్యమండలి మహాసభను చికాకోలువద్ద నరసన్నపేటలో జరుపుటకు తీర్మానించబడెను అని ఒకవిలేఖరి ఆంధ్రపత్రికకు వ్రాసిరి.

---

# బ్రిటను డి వెలరాకు లొంగుట

బ్రిటిషు ప్రభుత్వము డివెలరాగారికి లొంగినట్లు కనపడుచున్నది. ఏలననగా ఇదివరకు ఐర్లండు బ్రిటిషు ప్రభుత్వమునకు చెల్లించు వార్షికమును చెల్లించనిరాకరించినప్పుడు బ్రిటను ఐర్లండు సరకులపై సుంకములను హెచ్చించి బెదిరించవలసియుండెనుగదా! ఆసుంకములను ఇప్పుడు తీసివేయుటకును, ఐర్లండు ఇంటివ్యవహారములలో జోక్యమును ఇకమీదకలిగించుకొనకుండుటకును బ్రిటిషు ప్రభుత్వము అంగీకరించినట్లు లండనులో ఒకపత్రికయొక్క డబ్లిను (ఐర్లండు) విలేఖరి అపత్రికనుజూను ౨౭ వ తేది వ్రాసినాడు.

అంతేకాదు. డివెలరా తనలెండవఒడంబడికలో అడిగినదంతయు అంగీకరించుటకు బ్రిటను సన్నిద్ధమట. బ్రిటనునుండి ఇకమీద గవర్నరుజనరలు పంపబడడు. ఆస్థానమునకు ఐర్లండుజనులచే ఎన్నుకొనబడు ఒకడు నియుక్తుడగును.

ఇక సైనికవిషయములలో, ఐర్లండును ఇతర దేశముల సేనలదాడినుండి రక్షించు విషయములలో ఐర్లండుప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వముతో నొకఒడంబడిక చేసుకొనును. గొప్ప ఐరోపా సంగ్రామమేదైనను సంభవించినచో రెండు దేశములరక్షణకై చేయు ఏర్పాట్లలో నొకటిగా ఐర్లండులో విమానస్థావములు, మందుసామగ్రి తయారుచేయుయంత్రములు పెట్టబడును. కొన్ని విమానస్థానములు ఐర్లండుపడమటిభాగములో కొండలలోతొలచి బాంబులకు చెదరకుండ చేయుదురు. బ్రిటిషు సముద్రసేనలోకూడ క్రొత్త ఏర్పాట్లు చేయబడును.

## శ్రీ నన్నయభట్టారక సమాజము, రాజమహేంద్రవరము

ఈసమాజ ప్రారంభోత్సవము ఈ జూలై నెల ౩౧ వ తేదినాడు సాయంకాలము ౬గం॥ లకు రాజమహేంద్రవరమున జరుపబడును. జయంతి రామయ్యపంతులుగారు అధ్యక్షత వహింతురు. పండితాగ్రేసరులు ఉపన్యసింతురు.

# ఆరు నెలలకు ముందే తన మరణము పత్రిక టించిన యోగి

## నూరేండ్లకు మించిన ఆయుస్సు

ఢిల్లి జూలై 14:—

రేవారి, రాంపూరాలో భగవద్భక్తి ఆశ్రమము వ్యవస్థాపకులగు శ్రీపరమానందజీ మహారాజ స్వాములవారు యీ నెల 9 వతేది రాత్రి 8 గంటలకు సిమ్లాలో ధోల్పూరు భవనమున శాంతముగా భౌతిక శరీరమును విడనాడిరి. తాము జూలై నెల 9 వ తేది రాత్రి 8 గంటలకు సిద్ధి నొందెదమని ఆరు నెలల క్రితమే వీరు పత్రికల కెరిగించిరి. వీరికి నూరేళ్లు దాటినను కడపటి నిమిషము వరకును సంపూర్ణారోగ్యమును, దార్ఢ్యమును కలిగియుండిరి. వీరు పాశ్చాత్య పాశ్చాత్య వేదాంతశాస్త్ర పారంగతులు. వీరు రాంపూరాలో భగవద్భక్తి ఆశ్రమమును ఢిల్లిలో గ్రుడ్డివారికి సహాయము చేయుటకొక సంఘమును, సిమ్లాలో సనతీగీ సభను, కల్లింగ్దనుప్రభ్వి అంధ్రజనశరణాలయమును మరిపెక్కు సంఘములను నేర్పరచిరి. స్త్రీలకు విద్య నేర్పవలెనని వీరు గట్టిగా నొక్కి చెప్పుచుండిరి. గ్రామాభివృద్ధినిగూర్చి వీరు చాల శ్రద్ధబూనిరి. వీరు ప్రాచీన సంప్రదాయములలోను సంస్థలలోను చాల మార్పులను చేసిరి. నవీన పద్ధతులను వ్యామోహము లేకుండ నవలంభింపదగునని వీరు తెలుపుచుండిరి.” అని కెప్టను బలవీరసింగు ఎం. ఎల్. సి. గారు వ్రాసిరి.

వరంగల్లు తాలూకా

# కలాలీల విన్నపము

మహాఘనత వహించిన నిజాం ప్రభుత్వమువారి రెవిన్యూమెంబరుగారి సముఖమునకు—

ఈక్రింది సంతకములు చేసిన వారి అర్జి యేమనగా

1. ఈ క్రింది సంతకములు చేసిన వారు వరంగలుతాలూకానివాసులున్ను కలాలి వృత్తిగల వారునైయున్నారు. వీరికి జీవనోపాయము కలాలీ వృత్తియే గాని యితరజీవనోపాయ ములేవు. ప్రస్తుతము ప్రభుత్వమువారి ఆబ్కారిశాఖ మద్రాసుసిస్టం అనుసరించిన సందర్భములో అర్జీదారులు యీక్రింది విధముగా మనవిచేయుచున్నారు.

2. అర్జీదారులు పల్లెటూళ్లవారలున్ను ప్రభుత్వమువారి నియమములు, శాసనములు మొదలగునవి తెలియని వారునై యున్నారు. అర్జీదారులు ఆబ్కారి మొహతెమీం సాహెబుగారిచేత పిలువనంపబడి అచ్చువేసిన ఫారములమీద తమదస్కతులు చేయగలందులకు నిర్బంధింపబడిరి. అర్జీదారులను యిప్పటివరకు వారు ఆబ్కారి ముస్తాజరులకు యెంతడబ్బు చెల్లించుచున్నది యెంతపన్ను చెల్లించుచున్నదిన్ని అడిగిరి. తదుపరి ముస్తాజరుకు యిదివరలో వీరుచెల్లించిన మొత్తముమీద 100 కి రు. 25 లు వంతున హెచ్చించి అర్జిదారుల పేరుతో ఖాయపరచిరి. అర్జీదారులు యెక్కువ మొత్తముకు వేలంపాట పెట్టనందునను తమస్వంతముగా దరఖాస్తులు దాఖలుచేయనందునను ఆబ్కారి మొహతెమీంగారు కోపపడి అర్జీదారులనుకొట్టి బలాత్కారముచేసి వారిచే దస్కతులు చేయించిరి. అర్జీదారులకు యీవిచిత్రపద్ధతి యెందుకు అవలంబింపబడినదో, యీ అచ్చు ఫారములలో యేమి వ్రాయబడియున్నదో అవి కవుల్నో లేక కుబూలియతులో లేక దరఖాస్తులో అందులో యెంత మొత్తము ఒక్కొక్క గ్రామమునకు నిర్ణయించబడినదో బొత్తుగా తెలియదు.

3. యీప్రకారము వేలము చ ౧ మహారేవను ౧౩౪౫ సాలున ఆఖరు ఆయెను. పిమ్మట యీ అర్జీదారులకు తాము దస్కతులుచేసినవి దరఖాస్తుఫారములనిన్ని అని తమచేత స్వయముగా దాఖలుచేయబడినట్టుగా యెంచబడుచున్నవనిన్ని అందులోని మొత్తములు తాము యిష్టపూర్వకముగా ఒప్పుకొనినవిగా భావించబడుచున్నట్లు తెలిసికొనిరి. ఇది అర్జీదారులకు బహుఆతురత కలిగించెను. ఇప్పుడు ఆబ్కారీ మొహతెమీంసాహెబుగారి కచేరీలోయున్న దరఖాస్తులు యీఅర్జీదారులచేత దాఖలు చేయబడినవిగాని వారి యిష్టపూర్తిగా వ్రాయబడినవిగాని కావు.

4. దరఖాస్తు దాఖలుచేయునప్పుడు యీఅర్జీదారులు పైఅధికారుల కచ్చేరీలకు కంట్రాక్టుషరతులలోగల భయముచేత హాజరుకానందున వీరిని గ్రామోద్యోగులచేత పిలిపించి పోలీసువారితో భయపెట్టి అచ్చుఫారములమీద దస్కతులు చేయించుకొనిరి. గనుక యీసందర్భములో జరిగినపనులకు యీఅర్జీదారులు యెంతమాత్రము బాధ్యులుకారు. వరంగలుతాలూకా కలాలీలు పెద్దమొత్తములకు పాటపెట్టనందున తాలూకాఅధికారులు బలాత్కారముగా అర్జీదారులను అదేమొత్తములకు ఒప్పించజేసిరి. యెవరైనను మాంలాతీసికొనుటకు నిరాకరించినయడల అర్జీదారుల మొత్తంఆస్తిని స్వాధీనము చేసుకొనుటకున్ను అచ్చుఫారములలోనున్న మొత్తము వసూలుచేయుటకున్ను చర్యలు తీసికొనబడుచున్నవి. ఆబ్కారీమాంలాలు యిప్పుడు ముస్తాజర్ల యొద్దనుండి తీసికొనబడి ప్రభుత్వమువారిచే నిర్వహింపబడుచున్నవి. కాని ముస్తాజరుల కాలములోకంటె యెక్కువ కఠినపద్ధతుల పాలగుచున్నారు. మదరాసుసిస్టంప్రకారము ప్రభుత్వమువారి నిర్వహణములో కలాలీలకు ప్రత్యేకసౌకర్యములుయిచ్చి వారు ప్రభుత్వమువారికి యివ్వవలసిన మొత్తములను చాలావరకు తగ్గించవలసియుండెను. కాని ప్రస్తుతమిట్లు లేదు. యీఅర్జీదారులు వరంగల్లుజిల్లా అవ్వలుతాలుక్దారుగారికిన్ని ఆబ్కారీనాజంసాహెబుగారికిన్ని దరఖాస్తులుదాఖలు చేసికొనియుండిరి. అవివారిచేత ఆలోచించబడిగాని, వారివల్ల యీఅర్జీదారులకు ఉపశాంతి దొరకిగానియుండలేదు. అందువల్ల, అర్జీదారులు తమఃకిందులోని సంగతులు చెప్పక తమయిష్టములేకుండా బలాత్కారముగా దస్కతులు చేయించుకొని, వీరియిష్టప్రకారముదాఖలుచేయబడినట్టుగా భావించబడే అచ్చుదరఖాస్తుఫారములు వ్యర్థములైనవనిన్ని, న్యాయరహితమైనవనిన్ని ఆజ్ఞలను దయచేయుంచగలందులకు తమఘనమును మిక్కిలి ప్రార్థిస్తూయున్నారు,

ఇట్లు,

వరంగల్లుతాలూకా కలాలీలు అర్జీదార్లు:...

1. మడూరి నరసయ్య సా॥ కుమారపల్లి హనుమకొండ, 2. బమ్మగాని రాజన్న సా॥ వంచనగిరి, 3. పూజారి మల్లయ్య మొంద్రాయి, 4. బత్తిని వేంకట మల్లుసాముసూరు, 5. పోషాలనరసయ్య యల్లూరురంగంపేట, 6. దుడ్డె దూడయ్య చింతలపల్లి. 7. తాళ్లపల్లి నరసయ్య సంగం, 8. పూజారికొమారయ్య చౌళ్లపల్లి, 9. యెకొండ శాయన్న ఆత్మకూరు, 10. బూగాని యల్లయ్య ఆత్మకూరు, 11. బుర్రా బాలయ్య నందనం, 12. బుర్రా చంద్రయ్య యంగాల, 13. తాళ్లపల్లి నరసయ్య మొరిపిరాల, 14. సోల్టి రామస్వామి బొల్లుకుంట. 15 మడూరి వెంకటరాములు బొల్లుకుంట, 16. చీకోటి కొమరయ్య కనపర్తి - 17. ధోమట్టి వెంకయ్య 18, తీగల మల్లయ్య ఉప్పరపల్లి, 19. చీకోటికిష్టమ్మ పర్వతగిరి, 20 పుల్లూరి వెంకయ్య 21. పుల్లూరి ముత్తయ్య పర్వతగిరి వగైరా 28 గ్రామస్తులు.

# మదరాసు శిరోమణులగు ఆంధ్ర కవలలు

ఎం. వి. రామశర్మ, ఎం. వి. లక్ష్మణశర్మలను కవలసోదరులు మదరాసు విశ్వవిద్యాపీఠమునకు చెందిన మదనపల్లి థియసాఫికల్ కళాశాలలో ఒకరు తెలుగును, రెండవవారు వేదాంతశాస్త్రమును చదివి, బి.ఏ. పరీక్షలో ఇరువురును తమతమభాగములలో మదరాసురాష్ట్రముగా అందరిలోకి మొట్టమొదటి స్థానమును జయించిరి.

# నిజాం రాష్ట్ర పరిపాలనము

“ఈ రాష్ట్రప్రజలకు ఎన్నియో ఉపయోగకరములగు విషయములు గలవు.

తెలుగులోనే గాక ఉర్దూ, ఇంగ్లీషులలో కూడ ఇట్టి పుస్తకమింతవరకు వెలువడ లేదు.”

క్రౌన్ సైజులో ౧౦౦ పేజీలు.

వెల, గోలకొండ పత్రిక చందాదారులకు నాలుగు అణాలు.

ఇతరులకు రు. ౦-౬-౦ లు, టప్పాఖర్చులు ౨అణాలు.

పుస్తకములు వీ.పీ. గాపంపబడవు. స్టాంపులు టప్పాఖర్చులతో సహాపంపవలెను

గోలకొండపత్రికా కార్యాలయము,

- తూప్రుబజారు, హైదరాబాదు (దక్కన్)

# క్రొత్త వైస్రాయిగారి మెత్తటిమాటల అర్థము

## కాంగ్రెసు స్థాయిసంఘ విదేశ శాఖ యొక్క వ్యాఖ్యానము

"క్రొత్త భారతీయ విధానము" అను శీర్షిక క్రింద కాంగ్రెసు స్థాయిసంఘ విదేశ శాఖచే ప్రకటించబడిన మాసపత్రికలో ఈక్రింది విధముగ నున్నది:-

### పాలెక్కువ త్రాగుటకై ప్రచారము

"క్రొత్తవైస్రాయి, లిన్లిత్‌గోగారు పశువులను వృద్ధిగలవారలను శ్రేష్ఠజాతి ఆబోతులను దానముచేయుటతోను, గోధుమపైరులను తెగు ల్లను గూర్చి పరిశోధనల జేయుటకై ప్రోత్సహించుటతోను, సిమ్లా పురిపాలక సంఘము యొక్క అధికారము చెల్లుచో పాలెక్కువ త్రాగుటకై ప్రచారము చేయుటతోను తమ అధికారకాలము ప్రారంభించినారు.

ప్రభుత్వాధికారులకు ఈక్రొత్త వైస్రాయి గారిని "రైతు వైస్రాయి" అని పిలుచుట ఇష్టము. మరియు వారలు ఈవైస్రాయిగారు భారతీయ కృషీవలుల (అనగా రైతుల) ప్రేమను చూరగొనుటలో జయము పొందగలడని తలచుట మాత్రమేగాక నమ్ముచున్నారు. అంతేగాదు, ఈ ప్రభుత్వాధికారులు ఈ వైస్రాయి గారికి విలింగ్డనుగారి (వారికంటెముందు వైస్రాయి) పద్ధతులకంటె ఇర్విను గారి (విలింగ్డనుకంటె ముందు వైస్రాయి) పద్ధతులే ఎక్కువరుచించునని అనుచున్నారు.

### క్రొత్త వైస్రాయియొక్క ప్రధాన లక్షణము

"ఎట్లైనను, విలింగ్డనుగారి కఠిన విధానము వంటిదిగాక ఇర్వినుగారి మెత్తటి విధానము వైస్రాయిగానుండునంతవరకు లిన్లిత్‌గోగారి ప్రధానలక్షణమై యుండగలదని తలచుచున్నారు.

"లండను "టైమ్సు" పత్రికయొక్క సిమ్లా విలేఖరి ఈరెండు అంశములకును సమాధానమిచ్చుచు, లిన్లిత్‌గో ప్రభువుగారు "భారతదేశమందు అంతటను విశాలముగా వ్యాపించియున్న రాజకీయ స్వాతంత్ర్యాభిలాష"ను "క్రొత్తరాజ్యాంగములో నున్నంతమాత్రపు రాజకీయ స్వాతంత్ర్యము"నకేసి మొట్టి విరుగగొట్టగలుగుదని తలచుచున్నాడు. ఆర్థిక విషయములలో లిన్లిత్‌గో ప్రభువుగారు ప్రయత్నించుచున్నదంతయు మాత్రముఅమట్టుకు న్యాయవిధానము అమలుపరచుటమాత్రమే, అదియైనను ఆహారవృష్టి విత్తనములు, పశుసంతతి—వీటి విషయములో మాత్రమే. వాస్తవమేమన, సామ్రాజ్య తృష్ణ

తత్వ్రచోదనము క్రొటువుయొక్క వైస్రాయి యెంతమంచి బుద్ధిగలవాడైనను, అంతకంటె ఎక్కువమేలు చేయలేడు.

### లిన్లిత్‌గోగారి ఉద్దేశ్యము

తాను భారతజాతీయోద్యమమునకు సంతృప్తికలిగింపదలచినట్లు చూపించుటకు లిన్లిత్‌గో ప్రభువుగారు ఏమి చేయదలచిరో, ఇప్పుడప్పుడే చెప్పసాధ్యముకాదు. కాని, పూర్వ విధానమును సంపూర్ణముగా శృంఖలలోత్రొక్కుట చాలాకష్టమని మాత్రము చెప్పవచ్చును

### ద్వంద్వ విధాన సూత్రము

"వతేము, ప్రభుత్వము వారి వైఖరిలోని చిన్నమార్పులను గోరంతలు కొండంతలుగ తోచునట్లు చేయుటకై కఠినవిధానమును మెత్తటివిధానమును ఒకదానితరువాత నొకటి మార్చి మార్చి ప్రయోగించుతత్వమును దేశమిదివరకే ఎంతో చూచినది. ఈవిధానమునకు అవసరమగు ఒకయుక్తి ఏమనగా, మెత్తటి వైస్రాయీలను కఠినులైన వైస్రాయిలను మార్చి మార్చి పంపుచుండుట. ఈరెండుతెగల వైస్రాయిలును ఒకే దృక్పథముతో నుండువారే. దేశస్వాతంత్ర్య సమరదృష్టితో చూచినచో ఈ యిరువురు వైస్రాయీలకును భేదమేమియు లేదని భారతదేశము పూర్వానుభవముల స్పష్టముగా గమనించినది.

"వైస్రాయియొక్క చాకచక్యము, యుక్తి దేశములో నంతటను విశాలముగ వ్యాపించియున్న స్వాతంత్ర్యాభిలాషను విరుగగొట్టుట నిజముగా సంభవించకపోవచ్చును. కాని స్వాతంత్ర్యయోధులలో విభేదములును, అంతఃకలహములును అట్లువిరుగగొట్టవచ్చును. భారత జాతీయ కాంగ్రెసులో త్వరలో చీలికలు కలుగనున్నవనియు, ఏ మత్యము లేమి దానిపనికి ఆటంకమగుచున్నదనియు అభిప్రాయమును వ్యాపింపజేయుటకు యత్నమునుగూడ నిజముగాచేయుచున్నారు కాంగ్రెసు సామ్యవాదులు

(సోషలిస్టులు) అనియు సామ్యవాద ప్రతికూలురనియు రెండుచీలికలైనట్లు తలచుచున్నారు ఇప్పటి కాంగ్రెసు అధ్యక్షుడు పండిత జవహర్లాలుగారును, పూర్వపు కాంగ్రెసు అధ్యక్షుడు బాబురాజేంద్రప్రసాదుగారును, సామ్యవాదులును, అందరును ఆమాటనిజముకాదని ఎలుగెత్తిచెప్పినారు. వారిందరును, జాతీయస్వాతంత్ర్యవేదికపై ఒక కట్టులోనున్నట్లు చెప్పియున్నారు.

### కాంగ్రెసు కార్యములు

"భారతదేశ పరిస్థితులను అర్థముచేసికొనుటలో నిజమైన కష్టము కాంగ్రెసు యొక్క ఆచరణ సాధ్యములను కార్యక్రమములను గూర్చి ఆలోచించునపుడే సంభవించును. కాంగ్రెసు మొన్న లక్నోలో జరిగిన మహాసభలో కొన్ని క్రొత్త విధానములను నిర్ణయించినది వాటిలో తక్కినవాటికంటె ముఖ్యమైన రెండింటిలో ఒకటి జనసామాన్యముతో సంబంధమును గూర్చినదనియు, రెండవది రైతులవిషయమును గూర్చిన విచారణ, కార్యక్రమ మనియు జనులచే వ్యవహరించబడుచున్నది. ఈ విధానములను కొనసాగించుటకు అత్యుత్తమ మార్గమేది అను విషయములో చిన్నచిన్న భేదములున్నవను మాటను కాదనలేము. కాని ఆ విధానములును, వాటి మూలోద్దేశ్యమును అందరికిని సమ్మతములే

జనసామాన్యముతో సంబంధము అను మాటచే కాంగ్రెసువారి కర్థమగునది కాయకష్టము చేయుఅసంఖ్యాకులగు, జనులను, రైతులను పనివాండ్రను ఎక్కువమంది కాంగ్రెసు పిలుపును పూర్వముకంటెఎక్కువ తెలివితోవినుటకును, తమ అవసరములను, తెలుసుకొనునట్లు చేయుటకును సాధ్యముచేయుపద్ధతులు. రైతుల విషయములను గూర్చిన విచారణలు అనేక రాష్ట్రములలో అప్పుడే మహావేగముతో జరుగుచున్నవి. అఖిలభారతదేశమునకును, వేర్వేరు రాష్ట్రములకును సంబంధించిన వ్యవసాయ కార్యక్రమముల లక్షణము కాంగ్రెసువారలకు స్పష్టముగా బోధించబడినది.

"ఈ కార్యక్రమము ఉ విధానములు రైతులకు ఇపుడున్న కష్టములను గూర్చి మాత్రమేకాక దారిద్ర్యముల కారణములను గూర్చియు భూమిపై వ్యవసాయకుని కుండు హక్కు ఋణములను గూర్చియు, భూమిపన్నునుగూర్చియు కూడ విచారణ చేయబడుచున్నది ఇది ఇప్పుడు కాంగ్రెసు నిర్మాణములోను, జనసామాన్యముతో సంబంధించిన దాని కార్యక్రమములలో, రాజకీయ కార్యములు క్రమవికాస పద్ధతిగా నడచు విధానమునకు అవకాశములేకుండ చేయుటకు చాలును.

### జనసామాన్యముతో నిజమైనసంబంధము

ఖండితముగా నిర్ణీతమైన, వాస్తవబద్ధమైన ఈజనసామాన్యసంబంధము దృఢముగాచాటుకొనియున్నను అప్పుడే ఊగులాడుచున్న వర్గ, మతభేదములనుఛేదించి దేశమునంతయు సర్వ సమాన స్వాతంత్ర్యయోధమయముగా చేయుచున్నది. సంగతినిజము చెప్పు, సరిగావిషయములను గమనించు ప్రతివానికిని కనబడుచున్నది.

"లాహోరులో అనేకమంది ముసల్మానుల ఎదుట ఉపన్యసించుచు మౌలా నాహాబీబుల్ రహిమాను గారు ముసల్మానులందరును ఈ ప్రియమైనదేశముయొక్క స్వాతంత్ర్యముకొరకై పోరాడుటకు ప్రతినబూనవలయుననిన, తక్కినదంతయు వాటనేలభించగలదనియు ప్రబోధించినపుడీమార్పునే సూచించిరి.

ఆహరత్తు రాబోవుఎన్నికలలో మతముపేరగాక బీదజనసామాన్యబంధవిమోచనకై పాటుపడవలెను. నేడుగాకున్న రేపైనను దేశము క్రొత్తరాజ్యాంగమును పూడ్చిపెట్టగలదనిసత్యమూర్తి చెప్పినదినిజము." అని డాక్టర్ రాంమనోహర్ లోహియాగారు వ్రాసిరి.

తనమాతృభాషాజ్ఞానము లేనిభారతీయుని ఏమనదగును? అతనిని భారతీయుడని చెప్పదగునా???

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizam's Dominions.

పాఠకులకు

నిజాంరాష్ట్రీయ ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రుల లో వర్తకవృద్ధికి సాధనము గోలకొండ పత్రికలో ప్రకటనము

Vol. 11. | Thursday 23—7—1936 | No. 22

## హిందూదేశ సేవక సంఘము

(ఒక దేశాభిమాని)

### ప్రారంభము

ఈసంఘము ౧౨ జూను ౧౯౦౫నాడు స్వర్గీయ గోపాలకృష్ణ గోఖలేవలన పునహానగరమునందు స్థాపింపబడినది. త్యాగబుద్ధితో, కొద్ది వేతనములపైన, యోగ్యులగువారు, సక్రమపద్ధతిపైన జాతి మతభేదములతో పనిలేక మన మాతృదేశమగు భారతవర్షముయొక్క యభివృద్ధికై సేవచేయునట్లు కట్టుదిట్టములు చేయవలయునని గోఖలే మహాశయునివలన స్థాపింపబడిన ఈసంఘము, గడచినమాసములో ౩౧ సంవత్సరముల జీవితమునుగడపి, ౩౨వ సంవత్సరములో ప్రవేశించినది. కనుక ౩౧వ సంవత్సరపు నివేదికను పైసంఘమువారు వార్షికోత్సవమునాడు సభాముఖమున ప్రకటించియున్నారు.

ప్రారంభించినప్పుడు స్థాపకులగు గోఖలేకాక, (౧) ద్రావిడుగారు (౨) పట్వర్ధనుగారు (౩) దేవధరుగారు అను ముగ్గురుమాత్రముండిరి. ఆసమయమున గోఖలే తక్కినవారితో దేశసేవ విషయమున ప్రమాణము చేయించి, సంఘమున చేర్చుకొనెను.

### సభ్యులు

ఇప్పుడీసభయందు ౨౯మంది సభ్యులుకలరు. పూర్వపువారిలో స్థాపకుడగు గోఖలేయును, దేవధరును చనిపోయిరి. క్రొత్తవారు చేర్చుకొనబడిరి. దేశమునకు ఇట్టి సేవకుల యవసరము ఎక్కువగానున్నందున ముప్పదియొకటవ సంవత్సరమున ఆరుగురు ప్రొబేషనర్లు (పని నేర్చుకొనుచుండినవారు) సభ్యులుగా చేర్చుకొనబడిరి.

### కార్యనిర్వాహకులు

కార్యనిర్వాహక వర్గమున ఇప్పుడు హృదయనాథ కుంజ్రూగారు అధ్యక్షులు. [ఈకుంజ్రూగారు హైదరాబాదునకు పరిచితులు. ౧౩౩౬ ఫసలీలో జరిగిన మొట్టమొదటి ప్రజాపక్ష విద్యామహాసభకు వీరధ్యక్షులుగా దయచేసి దానిని జయప్రదమొనర్చిరి.] వీరుకాక ఒక ఉపాధ్యక్షుడును ఆరుగురు సభ్యులును కలరు.

### శాఖలు

ఈసంఘముయొక్క శాఖలు ఈక్రింద వివరింపబడియున్నవి

౧. ప్రధాన కార్యాలయము, పునహానగరము.

౨. మద్రాసునగరము శాఖ. దీనియాజమాన్యమున మద్రాసు, మాయవరము, (తిరుచినాపల్లిజిల్లా) మంగుళూరు, కాలికట్టులలో పని జరుగుచున్నది.

౩. బొంబాయిశాఖ:-[దీని పక్షమున బొంబాయిలోను, జలగాము [ఖాందేష్ జిల్లా]లోను పనిజరుగుచున్నది.

౪ ఉత్తరహిందూస్థానముశాఖ:- దీనిపక్షాన అలహాబాదులోను, లక్నోలోను పని జరుగుచున్నది.

౫. మధ్యపరగణాలశాఖ:-దీనిపక్షాన నాగపురము, భంబోరా, శెందూర్జన [అమరావతి జిల్లా]లో పనిచేయుచున్నారు.

౬. పంజాబుశాఖ:-దీనిపక్షాన [లాహోరులో] పనిజరుగుచున్నది.

౭. ఒరిస్సాశాఖ:-కటకములో దీనిపక్షాన పని జరుగుచున్నది.

### కార్యవిధానము

వీరుచేయు పనులలో మొదటిది రాజకీయములది. వీరిరాజకీయ ప్రణాళిక మితవాద సంబంధమైనది. అనగా, ఇప్పటి కాంగ్రెసుఉద్యమముకంటె మృదుతరమైనది, సౌమ్యమైనది. హిందూదేశమునకు బ్రిటిషుప్రభుత్వముయొక్క ఆదరణముక్రింద స్వపరిపాలనము [Swaraj-Under the British Flag] లేక, డామినియను స్టేటసు" [Domenian Status] అనునది వీరియాదర్శము. దీనిని సాధ్యమైనంతకాలమునకు నెమ్మదిగా, తొందరపడకుండ, తీవ్రపద్ధతులకు పోక, సౌమ్యముగా పొందవలయునని వీరియాశయము.

ఈసంఘ సభాసదులు ఇట్టియాశయములతో ఉపన్యాసము లిచ్చుచుందురు. "లిబరల్ ఫెడరేషను" అనగా మితవాద మహాసభలు సమావేశపరచెదరు. కాని వీరికార్యవిధానముపై ప్రస్తుతకాలమున జనసామాన్యమునకుగాని, యువజనులకుగాని, ఎక్కువవిశ్వాసములేదు. కనుక వీరికి అనుచరవర్గము చాల తక్కువ. అదెట్లుండినను మనకు ఆవిషయముతో అంతగా ప్రసక్తిలేదు, అయినను ఒకసంగతి, మనకు సంబంధించియున్నది. అదేమనగా వీరు దేశీయసంస్థాన రాజ్యములలోని ప్రజలకష్టనిష్ఠురములను తీర్చ కొంత పనిచేయుచున్నారు పైనచెప్పిన ౨౯మంది సభ్యులలో ఈకార్యమునకై నిర్ణీతులైనవారు ఇద్దరు. వీరిపేళ్లు దేశీయసంస్థానవాసులముగు మనము తెలిసికొనవలయును. వారు, ౧. పట్వర్ధన్ గారు ౨. వఝెగారు. వీరు ఫల్టను, మిరజ్, ఔంధు మున్నగు దేశీయసంస్థానముల శాసన సభలలో సభ్యులుగాకూడ నున్నారు "సంస్థానస్వరాజ్" అను పత్రికకూడ నడుపుచున్నారు. ఇది సంతోషప్రదము. ఆసంస్థానాధిపుల ఔదార్యమునకిది నిదర్శనము. ఇదివరకిండియాలోని శాసనసభలలో వీరందరోపనిచేసి మెప్పుపొందినవారు. అట్టివారిలో రైటుఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు, యన్. యం. జోషీగారు పేర్కొనదగియున్నారు.

పై విషయములుకాక, ఆర్థిక సంబంధమున లేబరు [కార్మిక] ఉద్యమమునను స్థానిక స్వపరిపాలనోద్యమమునందును, సహకారోద్యమమునందును, గ్రామపునర్నిర్మాణోద్యమ మందును ఈ సంఘ సభ్యులు అమూల్యమగు సేవ గావించుచున్నారు.

### సంఘసేవ

వీరు చేయుచున్న సంఘసేవలలో సేవాసదనములనుగొప్పసంస్థలు ప్రశంసార్హములు. ఇట్టివానిలో ప్రధానమైనది పునహాలోనున్నది వందలకొలది స్త్రీలకు నగరములోని వివిధములగు ఉద్యోగములు, చేతిపనులు లభింపజేయబడి, జీవనోపాధులు సంపాదింపబడుచున్నవి. స్త్రీలకుపయుక్తములగు ఎన్నియోసేవలకు వీరుసిద్ధము చేయబడుచున్నారు ఈ సంస్థయొక్క శాఖలు మదరాసు, నాగపురము, బొంబాయిమున్నగు చోట్ల అపారమగు సేవచేయుచున్నవి. మన హైదరాబాదనగరముననొక శాఖస్థాపింపవలయునని శ్రీ. శ్రీ. దేవధరుగారు సంకల్పించియుండిరి. కాని అది జయప్రదము కాకముందే వారు దివంగతులయిరి. అది ఇంకను సంకల్పరూపముననే యున్నది.

ఇదికాక, నిమ్నజాత్యుద్ధరణమునకై హరిజన సేవకసంఘములను, హిందూదేశమునందంతటను స్థాపించి వానికి ప్రధాన కార్యదర్శిగాపనిచేయుచున్న ఏ. వి. ఠక్కరుగారీ దేశసేవా సంఘసభ్యులే. మద్యపాన నిరసనము, పరిశ్రమాభివృద్ధి, ప్రజారోగ్యము, మున్నగు పనులందు గొప్పగొప్ప సంస్థలను ఈ సంఘసభ్యులు నడుపుచున్నారు. కరువులు, భూకంపములు వచ్చినప్పుడు వీరుచేయుచున్న సేవ అపారము.

### విద్యావిషయము

బాలభటోద్యమము విద్యామహాసభల సమావేశపరచుట గ్రంథాలయోద్యమము మొదలగునవి వీరి శ్రద్ధవలన దేశమున పలుతావుల వ్యాపనము చెందుచున్నవి. వానివివరముల గ్రంథవిస్తర భీతిచే వదలుచున్నాను.

### పత్రికాప్రచురణ

వీరుమూడుపత్రికలను ప్రచురించుచున్నారు. (౧) జ్ఞానప్రకాశము అను మరాఠీదినపత్రిక- ఇది బొంబాయి నుండి వెలువడుచున్నది, దీని సంపాదకులు శ్రీయుత లిమయేగారు. (౨)సర్వెంట్ ఆఫ్ఇండియా [Servant of India] దేశసేవకుడుఅనువర్థముకల ఇంగ్లీషువారపత్రిక. సంపాదకుడు శ్రీయుత వఝెగారు[౩]"హితవాద" అను ఆంగ్లపత్రిక నాగపురమునుండివారమునకుమూడుమారులు వెడలును. దీనిసంపాదకులు అంబేకరుగారు. ఇవికాక దేశీయ సంస్థానముల ప్రజలయోగక్షేమములను దెల్పు "సంస్థానికస్వరాజ్య" అను ఏదొక పత్రిక ఇంగ్లీషు మరాఠీ భాషలలో వెలువడుచుండును. దీని సంగతిపైన నుల్లేఖించియున్నాను.

### ఆర్థికములు

ఈకార్యములన్నిటికిని సంవత్సరమునకు సుమారు ౭౦ వేల రూపాయలువ్యయమగుచున్నవి. ఆదాయమార్గములు, చందాలు, పత్రికామూల్యము మొదలనవి మాత్రమే. ముప్పదిమందిసభ్యులు పనిచేయుచున్నారని భావించినచో, ఒక్కొక్కరిపైన రెండువేల రూపాయలచొప్పున వ్యయమగుచున్నదని లెక్కవేయవచ్చును. సభ్యులు మూడు తరగతులుగ నుందురు. [౧] సీనియరు సభ్యులు. [౨]సాధారణసభ్యులు[౩] పనినేర్చుకొనువారు. వీరికినెల జీతములు౫౦నుండి౧౨౫ రూపాయల వరకుండును. వారలర్హతము బి. ఏ. పట్టమునుపొందినగాని పనినేర్చుకొనువారుగా చేర్చుకొనబడరు ప్రవేశించినతరువాత ౫ సంవత్సరములు సంఘము వారిమార్గదర్శకత్వమున తర్ఫీదుకావలసియుండును. కనుక వీరి కొరకు ద్రవ్యము విరివిగాఖర్చుఅగుచున్నది.

### ఉత్తమ విధానము

ఈ విధముగ దేశసేవకులు సిద్ధపరచు అత్యుత్తమమైనది. వేరువృత్తులు జీవనాధారముగ యవలంబించి తీరికవేళ దేశ సేవచేయువారలన ఎక్కువ కార్యము పట్టుదలతో నెరవేరజాలదని తలచి దేశసేవయే వృత్తిగా నవలంభించి పనిచేయువారిని ఒకచో కొద్దివేతనముపైన జేర్చి, వారికి మంచి తర్ఫీదునొసగి కార్యకారులజేసి నిర్మాణ కార్యక్రమమును సాగించుచున్న ఈ హిందూదేశసేవక సంఘము సార్థక నామమైనది.

### మనకును కావలెను

ఇట్టి సంఘము మన నిజాం రాష్ట్రమునకును కావలసియున్నది. గడచిన నలుబది సంవత్సరములనుండి దేశకార్యములకైన మన రాజ్యమున వేలకొలది రూపాయలు వ్యయము అగుచున్నవి. పండితకేశవరావు, దేశభక్తవామననాయకుగార్ల వంటివారును, ఇతరులును దేశకార్యము యెడ శ్రద్ధతోని ద్రవ్యము వ్యయముచేసి యున్నారు. ఇప్పటికిని నగరమున ఎన్నియో విద్యావిషయక సంస్థలున్నవి. కాని అవియన్నియును, తత్సంబంధమైన యుద్యమములును "తీరికవేళ దేశసేవ" చేయువారివలన నడుపబడుచున్నవి. అందువలననే ఈ యుద్యమములలో క్రమపద్ధతిగాని, మధ్యన ఆగకుండునట్లు కట్టుదలగాని కానవచ్చుటలేదు. నిజాంరాష్ట్రసేవసంఘము. (Sirvant of Hyderabad Soclit ఒకటి స్థాపితమైనచో చాలమేలు చేకూరగలదు. ఇదే, కాని హిందూదేశ సేవకసంఘమును స్థాపించుటకు స్వార్థరహితుడగు మహాత్ముడు గోపాలకృష్ణగోఖలే యుండెను. అట్టివాడు మనకేడీ?



Printed and Published by B. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad. Editor K. Balakrishna Reddy.